# శేషశైలవాస శ్రీనివాస

## శ్రీనివాస పంచశతి

ఆత్మప్రపత్తి

లోకప్రవృత్తి

Ramadevi Academy of Multiple Arts
15, Pranava 10th Main, 26th Cross.
Banashankari Second Stage.
BANGALORE– 560 070. Tel. 6716925

రచన
వై.వి. వెంకటేశ్వరరావు

# శేషశైలవాస - శ్రీనివాస

శ్రీనివాస సంపత్తి

ఆత్మ ప్రపత్తి లోక ప్రవృత్తి

రచన :

వై.వి. వెంకటేశ్వరరావు

15, ప్రణవ

10 మెయిన్

బనశంకరి 2 స్టేజి

బెంగళూరు - 560 070.



ప్రచురణ :

వై.వి. వెంకటేశ్వరరావు

మొదటి ముద్రణ : ఫిబ్రవరి, 1995.

ముద్రణ :

కె.యల్.హై-టెక్ సెక్యూర్ ప్రింట్ లిమిటెడ్

ప్లాట్ నెం. 230, రోడ్ నెం. 36,

జూబ్లీ హిల్స్, హైదరాబాద్ - 500 034.



శ్రీ
అలమేలుమంగపతి
శ్రీ
వెంకటేశ్వర స్వామికి
అంకితం

# ఆత్మీయం

**డాక్టర్ చన్నాప్రగడ తిరుపతిరావు**
నివృత్త ఆంధ్రోపన్యాసకులు, బెంగుళూరు విశ్వవిద్యాలయం.

శ్రీ వెంకటేశ్వరరావు గారు నాకు చిరకాల మిత్రులు. సత్కార్యాలన్నిట్లో సహచరులు. మేమిద్దరం కలసి ఒక విధంగా అభినవ తిరుపతి వేంకటేశ్వరులం.

శ్రీ వేంకటేశ్వరరావు గారు ఎన్నో నాటికలు, తెలుగులోనూ కన్నడంలోనూ, వ్రాశారు. పాటలు, కీర్తనలు వ్రాశారు. కొన్ని రమణ కీర్తనలు గాయకుల అభిమానానికి పాత్రమై, దేశం అంతటా మారు మ్రోగినవి కూడా. అయన వివిధ ఛందస్సుల్లో పద్యాలు వ్రాశారు. అయితే, ఆలనాటి వేమన్నకు లాగానే, ఆయనకు అభిమాన పాత్రమయింది ఆటవెలది. (శ్రీ వేంకటేశ్వర రావు గారి విషయంలో ఛందస్సు మాత్రమే సుమండీ) అందుకే అభిమానంతో ఆయనను అభినవ వేమన అని రసజ్ఞ మిత్రులు అంటూంటారు.

శ్రీ వేంకటేశ్వరరావు గారు శ్రీ వేంకటేశ్వర స్వామివారి ఆంతరంగిక భక్తులు. ఆయన తన ఆర్తినీ, ఆకాంక్షనూ, ఆవేదననూ, ఆక్షేపణనూ తన ఎదలోనే నెలకొని ఉన్న ఆ శేషశైలవాసుడైన శ్రీనివాసుడికే నివేదించుకుంటుంటారు. మూడు దశాబ్దులుగా సాగుతున్న ఈ నివేదనల సంపుటే ఇప్పుడు మీ ముందున్నది. ఆయన ఆర్తి ఆయన ఒక్కడిది కాదు; అది మానవ జాతి మొత్తపుటార్తి. ఆయన ఆకాంక్షలుకూడా వ్యక్తి గతమైనవి కావు. ఇక్కడా ఆయన యావన్మనుష్య జాతికే ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఆయన ఆవేదన అంతా మానవ జాతిని గురించే. నాగరకతా వ్యామోహపు ఊబిలో దిగబడి పోయిన మానవాళి, ఐహిక పారలౌకిక సుఖాలనుండి వంచింపబడి, దిక్కుతోచక, మకరదంష్ట్రాగ్రస్త గజేంద్రుడి లాగ, తనను గట్టెక్కించమని మొర పెట్టుకొనే ఆవేదన అది. అలాగే ఆధునిక విజ్ఞానం వేస్తున్న వెర్రితలల వల్ల అంతరంగ బహిరంగ నాస్తికతలు ప్రబలి, ఆసురీశక్తులు విజృంభించి, సత్యాహింసలు అడుగంటిన నేటి సంక్షుభిత ప్రపంచాన్ని తటస్థంగా నిలబడి విహంగావలోకనం చేస్తున్న ఆయన ఆక్షేపణల్లో అసహనపు వేడి ఉన్నది; హాస్యపు వాడి ఉన్నది; బాగు పడమనే ప్రబోధం ఉన్నది. చేయి పట్టుకుని నడిపించే మార్గదర్శికతా ఉన్నది. మొత్తం మీద చెప్పాలంటే ప్రపంచాన్ని కాచివడపోసిన జీవిత సారం ఉన్నది. చదువు వల్లా, స్వాతంత్ర్యం

దైవాన్ని నమ్మకపోతే అది కూడా నేలకు రాలుతుంది. ఇక్కడ ఆస్తిక్య సూక్ష్మాన్ని ఎంతో సూచ్యంగా చెప్పారు వెంకటేశ్వరరావుగారు.

'లోకప్రవృత్తి' శీర్షికతో రాసిన పద్యాల్లో చక్కని అధిక్షేపముంది. అనేక సామాజికాంశాలను గురించిన విసుర్లు ఉన్నాయి. స్త్రీల కేశసంపదవిషయంలో ఓ తమాషా పద్యం రాశారు వీరు —

"పొడుగు జడలు పోయె, ముడులు వచ్చె, ముడులు
కూడ పోయి కురులు కురుచనాయె
పూలు తురుమబోవ పూబోడి బోడిరా."

జుత్తు కత్తిరింపుల్లో వచ్చిన మార్పును గురించి చెప్పడం మామూలే. పూలు తురుమబోతే "పూబోడి బోడిరా" అనడం శ్లేషగర్భిత చమత్కృతికి నిదర్శనం. పూబోడి అంటే పువ్వువంటి శరీరంకలది అని. ఇక్కడ బోడి అంటే "బాడీ". ఇక తలకు సంబంధించిన బోడితనం మనకు తెలిసిందే.

రెండోభాగంలో మొదటి భాగంలో ఉన్నంత ఏకసూత్రత లేదు. రకరకాల అంశాల సమాహారమిది. ఇందులో వివిధ విషయాలను గురించేకాక తాము అభిమానించే కొందరు వ్యక్తుల గురించి కూడా రాశారు. ఏళ్ల తరబడిగా ఆయా ప్రత్యేక సన్నివేశాలతో ప్రేరితులై శ్రీ వెంకటేశ్వరరావుగారు ఈ ఆటవెలదులను ఆడించారు. కొన్ని పద్యాలు గణాలను లెక్కించుకుంటూ పొదిగినట్లున్నా, కొన్ని ధారారమ్యంగా, ఛందోవలయంలో ఉంటూనే స్వచ్ఛందంగా సాగిపోయాయి. ఈ చక్కని పఠనీయగ్రంథం గురించి నాలుగుమాటలు రాయవలసిందిగా తమసోదరులు, నా మిత్రులు జస్టిస్ శ్రీ వై.వి. ఆంజనేయులు గారిద్వారా నన్నుకోరిన శ్రీ వెంకటేశ్వరరావుగారి రచనా ప్రతిభకు నా అభినందన.

(సి. నారాయణరెడ్డి)

# పరిచయవాక్యం

"శేషశైలవాస - శ్రీనివాస" అంటూ ఆటవెలది ఛందస్సు లో వ్రాయడం ప్రారంభించి ఇరవై తొమ్మిదేళ్ళు ఇప్పటికి. శ్రీనివాసుని వైభవాన్ని, తిరుమలగిరిపై గుడిలో జరిపే నిత్య సేవలను ూట ఎనిమిది పద్యాలలో వ్రాశాను. ఇవి, ఈ పుస్తకంలో ప్రథమ భాగంగా ఏర్పరిచాను 'ఆత్మప్రపత్తి"గా. ఇక, మిగిలిన నాలుగు వందలైదు పద్యాలు రెండవ భాగం. నా చుట్టూ, సంఘంలో, సమాజంలో, సంసారాల్లో, సంస్థలలో, రాష్ట్రాలలో, దేశంలో, దేశాలలో, ప్రజలలో, ప్రభుత్వాలలో, ప్రపంచంలో జరిగిన ఎన్నో విషయాలకు స్పందించి వ్రాసిన పద్యాలివి. ఈ పద్యాలలో హాస్యం, హేళన, ఎత్తిపొడుపు, వెక్కిరింపు, ఎగతాళి ఉన్నట్లే, వీటి వెనుక ఆక్రందన, వేదన, ఆరాటం, ఆశనిరాశలు, ఆలోచన, ఆకాంక్ష, ఆవేశం, ఆగ్రహం, ఆరాధన, ఆశయం న్నాయి. ఈ రెండవ భాగం "లోకప్రవృత్తి".

ఈ పద్యాలను వ్రాయమని ఆదేశించిన వారు, ఆజ్ఞ చేసినవారు శ్రీ వేంకటేశ్వరస్వామి. త్సాహమిచ్చిన వారెందరో మిత్రులు. పద్యాలలోని పద, భావగమనాలకు ప్రేరణ ప్రజాకవి మన. పద్యగమనంలో తడబడిన చోట్ల, ఆదుకుని సరిదిద్ది, సహకరించిన మిత్రులు డాక్టర్ న్నాప్రగడ తిరుపతిరావు గారికి కృతజ్ఞుణ్ణి.

ఎవరెవరెంతెంత సహకరించారో వారందరికీ లోపలి పద్యాలలోనే కృతజ్ఞతలు తెలుపుకున్నాను.

ంచిన శ్రీ వేంకటేశ్వరుడే మీ చేత ఈ పుస్తకాన్ని చదివిస్తాడు.

నమస్కారం.

వై.వి. వెంకటేశ్వరరావు.

గుంటూరు.

## ప్రథమ భాగంలో

## నిత్యసేవ

సుప్రభాత వేళ విప్రవర్యులు పాడ
చక్కగ వినునట్టి చక్కనయ్య,
మమ్ము గాతువయ్య, మా మ్రొక్కులనుగొని
శేషశైలవాస శ్రీనివాస

తోయజేక్షణ మిము తోమాల పూజింప
సంతసించి మమ్ము చెంతనిల్పి
అభయ హస్తముంచి, శుభములనిత్తురు
శేషశైలవాస శ్రీనివాస

వేలపేర్ల మీకు వేడ్క నర్చన సేయ
కామితముల దీర్చు స్వామి మీరు,
వేంకటేశ, ఈశ, వెతలబాపెడి దేవ
శేషశైలవాస శ్రీనివాస

కొలువు చేయమిమ్ము పిలువగ, కులుకుచు
వచ్చి ఆర్జితముల వార తిథుల
వరుసవినుచు, మురిసి, వరములనిత్తురు
శేషశైలవాస శ్రీనివాస

పరమభక్తిపరులు గురువార పూలంగి
సేవచేసి నిలుచు సేవకులకు
శుభములిచ్చి, గాచు, శోభామయులుమీరు
శేషశైలవాస శ్రీనివాస

శుక్రవారమందు శుభముగ నభిషేక
పూజల జరిపించు పుణ్యవరుల
ఆశలన్ని మీరలవలీల తీర్తురు
శేషశైలవాస శ్రీనివాస

పలురకమ్ములైన ఫలహారముల మీకు
వడ్డనమ్ము సేయ వరుసగాను
ప్రీతి వాటినంది విశ్వరూపముచూపు
శేషశైలవాస శ్రీనివాస

విశ్వరూపమటులె వీక్షించువేళలో
వేయి రూపులుగల వేంకటేశ
వేల వేల ప్రజల పాలింతురెవ్వేళ
శేషశైలవాస శ్రీనివాస

స్వర్ణ శయ్యపైన సరిపట్టు పరుపుల
పరచి, మధుర గీతి పాడుచుండ ...
పవ్వళింతురయ్య, పన్నగాద్రీశ, ఘా
శేషశైలవాస శ్రీనివాస

నీవు విష్ణువనుచు, నీవె శివుడవంచు
శక్తియనుచు నిన్ను భక్తులెంచి
కొలుచు చుందురు, నిను, కలియుగ దైవమా
శేషశైలవాస శ్రీనివాస

## ఏడుకొండలవాడు

ధరణి కేగవయ్య, గిరిగ నిలువుమయ్య
నెలవు నాకదౌను, కలిని, శేష!
అనగ వెలసిన నగ మందు వాసివి నీవు
శేషశైలవాస శ్రీనివాస

గరుడుడు దివి నుండి ధరకు తెచ్చినగిరి
వేదముల నిలయము వేంకటాద్రి
నరునివోలె మనిరి గరుడాద్రిలో మీరు
శేషశైలవాస శ్రీనివాస

స్పర్శమాత్రముననె సర్వపాపములను
తొలగచేయు శక్తి కలిగిన గిరి
వెలసినారు వేడ్క వేంకటాద్రిని మీరు
శేషశైలవాస శ్రీనివాస

కోరి వరమొసంగ నారాయణుని మెచ్చి
భద్రమూర్తి వెలసె నద్రియతని
పేర మీ నిలయము నారాయణాద్రీశ
శేషశైలవాస శ్రీనివాస

పోరు సల్పి, వీగిపోయెడి సమయాన
కోరె మిమ్ములు తన పేరు నిలుప,
వల్లెయనిరి మీరు, వృషభాద్రి వెలసెను
శేషశైలవాస శ్రీనివాస

మహిష వాహనుండు మహిని జీవుల మృత్యు
మర్మమెరిగిన యమధర్మరాజు
చేసినట్టి తపముచే వృషాద్రి నిలిచె
శేషశైలవాస శ్రీనివాస

అంజనీసతి ఇట సంజాత సుత వాంఛ
తపము చేసి కనెను, కపివరేణ్యు,
అచట వెలసి మనుదు వంజనాద్రినివాస
శేషశైలవాస శ్రీనివాస

సప్తగిరులపైన సాదరమ్ముగ నిల్చి
జగతి కాచుచున్న చక్కనయ్య,
మిమ్ము మరువమయ్య, మమ్ము కావుము దేవ
శేషశైలవాస శ్రీనివాస

## అంతా మీరే

పాత కొత్తదాయె, పరికించి చూడగ
పాత లేక కొత్త వచ్చు నెట్లు?
పాత కన్న పాత, పరమేశ్వరా, మీరు
శేషశైలవాస శ్రీనివాస

కొండ మీదనున్న కొండంత దేవరా
వరములిచ్చి కాచు కరుణ మూర్తి
పాదములను బట్ట, బాధ మాయముజేయు
శేషశైలవాస శ్రీనివాస

నిజము నేనుకాన, నిజము మనుజునాత్మ
ఆత్మ నిజమన పరమాత్మ నిజము
పరమ పురుష నీవు పరమాత్ముడవు మాకు
శేషశైలవాస శ్రీనివాస

కొండమీద మీరు, మెండుగ నిలబడి
పిలుచుచుందురయ్య ప్రీతితోడ,
పిలుపు వినిన మేము, నిలువము దూరాన
శేషశైలవాస శ్రీనివాస

నడుచుకొందు మేము, నడిపించునది నీవు
నడువవలయు ధైర్య పడుచు మేము,
నడువ వెరప దేల? నడిపించు నీవుండ
శేషశైలవాస శ్రీనివాస

పలురకముల నగలు, బంగారమొక్కటే,
పేర్లు కోట్లు, వాటి వెనుకనున్న
వాడ వీవొకడవె, వసుధను గావగ
శేషశైలవాస శ్రీనివాస

అన్నిదేహములను ఆత్మ యొక్కటి గాన
ఆత్మ రూపమేమొ, ఆత్మ కెరుక,
ఆత్మ కాచెడి పరమాత్మవు నీవయా
శేషశైలవాస శ్రీనివాస

## కోపగించకు

ఎంతవారికైన, శాంతమిచ్చు, శుభము,
కోపగించ సుఖము లోపమగును,
నీవు కోపగించ నింగి నేలను రాలు
శేషశైలవాస శ్రీనివాస

పాప భీతి లేదు, శాపభీతియు లేదు,
ధర్మ బుద్ధి లేదు, దయయు లేదు,
నీవు కోపగించ, నేల కంపింపదా?
శేషశైలవాస శ్రీనివాస

ఒక్కరోజు నిద్ర తక్కువైనప్పుడు
క్రుంగి పోదుమేము రోగులట్లు,
కునుక తీయనీము, కినుక వహింపవు
శేషశైలవాస శ్రీనివాస

పండగానె పండు పడును నేలను రాలి,
బతుకు మట్టి పాలు, వయసునిండ
నిన్ను నమ్మకున్న, నింగి నేలను రాలు
శేషశైలవాస శ్రీనివాస

## పలికించు, స్వామి

పలుకుచున్నదీవు, పలికించునది నీవు
పలుకుచుంటిననుచు తలతురెల్ల,
పలుకు నీది కనుక, భావాలు దొరలురా
శేషశైలవాస శ్రీనివాస

## నీవె లేవట

నీవు సృష్టి చేసి నిలిపిన ధరమీద
జననమొందు చున్న మనుజకోటి
నీవె లేవని తెగ నీలుగు చున్నారు
శేషశైలవాస శ్రీనివాస

నీవు నిజముగాన, నిజమైతి నేనయ్య,
నీవుగాక వేరు నిజమదెచట,
నీవు నిజము కాదని మనువారెవరిల
శేషశైలవాస శ్రీనివాస

పరము మిథ్య అనెడి పరమ మూర్ఖులుగల
అవని గాతురయ్య అగుపడకనె,
కంటికగుపడరని, కల్ల యందురు మిమ్ము
శేషశైలవాస శ్రీనివాస

నీవు రాయివనుచు నీల్గు వారికి కూడ
తోడునిల్చి వారి గోడులెల్ల
తొలగ చేతువయ్య తోయజేక్షణ నీవు
శేషశైలవాస శ్రీనివాస

## సృష్టి

కోయిలమ్మ పాట గోర్వంక మాటలు
నెమలి యాట, చిలుక నెలత పలుకు
భ్రమరరాజు పొగరు, బలువింత మీ సృష్టి
శేషశైలవాస శ్రీనివాస

మొదట నొక్కటేదొ ఉదయించినందున
నేడు సృష్టి పెరిగి వేడుకాయె
మొదటి సృష్టికీవె మూలము కద దేవ
శేషశైలవాస శ్రీనివాస

## కాపాడే దైవం

పలుకులోన గాని, పాటలోపల గాని
నిన్ను భక్తి దలచి సన్నుతింప
కోరినన్ని ఇచ్చి కూర్మితో బ్రోచేవు
శేషశైలవాస శ్రీనివాస

మ్రొక్కు కొనుట యనెడు చక్కని మార్గాన
సొత్తు, జుత్తు, సత్తు మొత్తమూడ్చి
చిత్తు చేసి మనసు, మెత్తగా చేతువు
శేషశైలవాస శ్రీనివాస

చేసినట్టి పాప చేష్టల ఫలితము
పరిహరింప నీదు శరణుజొచ్చి
కావు మనుచు నిన్ను సేవించుచున్నారు
శేషశైలవాస శ్రీనివాస

భక్తి లేనివాడు భాగ్యవంతుడుకాడు
పూజసేయ నౌను పుణ్యశీలి
నిన్ను నమ్ముకొన్న నిత్యము శుభమేను
శేషశైలవాస శ్రీనివాస

జన్మనిచ్చి నావు, జ్ఞాన మిచ్చితివయ్య
చెన్నుమీర మనగ చెప్పినావు
చెప్పినట్లు వినక చెడిపోవుచున్నాము
శేషశైలవాస శ్రీనివాస

లేవవయ్య, దేవ, లేచి చూడగదయ్య
నీవు నిదుర పోవు నిముసమందు
మనుజులెంత హీన మార్గాన నడతురో
శేషశైలవాస శ్రీనివాస

కలత లేని చోట నలతయుండదు గాదె,
కల్ల లాడకున్న కలుగు సుఖము
నిన్ను నమ్మకున్న సున్న యౌజన్మము
శేషశైలవాస శ్రీనివాస

శ్రీనివాస, ఈశ, శ్రీ వేంకటేశ్వర
పాపములను రూపు మాపు స్వామి
కరుణబ్రోవు మమ్ము కరుణాంతరంగ, శ్రీ
శేషశైలవాస శ్రీనివాస

చేతులెత్తి నిను సేవించినంతనె
వరములిచ్చి కాచు పరమపురుష
మ్రొక్కు వారికోర్కె గ్రక్కున తీర్చెడి
శేషశైలవాస శ్రీనివాస

అమ్మ, ప్రీతిని చరణాబ్జములను కొల్వ
నంతరంగమందు సంతసించి,
అమ్మ మాటను విని అందరి బ్రోతువు
శేషశైలవాస శ్రీనివాస

పళ్ళెమందు చంద్రు, బాలు డెట్లు గనునొ
మనుజుడటులె గాంచు, మానసమున
నిత్య నూత్నమైన నీ దివ్య రూపమ్ము
శేషశైలవాస శ్రీనివాస

తనను తాను తెలిసి కొనవలెనన్నచో
సత్ప్రవర్తనులను సవినయాన
చూచి, వారిలోన చూడవలెను మిమ్ము
శేషశైలవాస శ్రీనివాస

## చల్లనయ్య

నిలుపవలయు మదిని, నిఖిలేశనీపైన
నిన్ను చూడకనులు నింపవలయు
నడువ వలయు నిన్ను నమ్మిచు, కొలుచుచు
శేషశైలవాస శ్రీనివాస

తీపి తినుట వలన తీయనవ్వదుమది,
కారమెక్కువతిని కటువుకాదు,
నీవు మలచినట్లు నిండుగ మెలగును
శేషశైలవాస శ్రీనివాస

ధనికుడనుకొను, తన మనమున దృఢముగ
కొనదగునెది యైన ధనము తోడ
శక్తి నిన్ను కొనగ భక్తి యొక్కటె స్వామి
శేషశైలవాస శ్రీనివాస

చక్కనయ్య మీరు చక్క జూతురు మమ్మ
నిక్కుబోయి మేము చిక్కులబడి
దిక్కు తోచనపుడు దిక్కైవెయందుము
శేషశైలవాస శ్రీనివాస

ఆశపడినది మనకంద లేదని మది
పాడు చేసుకొనుట పాడి కాదు,
మీరలిత్తురెంత? మేము నోచిన దెంతొ?
శేషశైలవాస శ్రీనివాస

ఒరులలోన మంచి పరికింప వలయును
వారిలోన కలరు మీరనుకొని,
మిమ్ము గాంచగానె, నెమ్మది యౌమది
శేషశైలవాస శ్రీనివాస

చిక్కువచ్చినపుడు మ్రొక్కుకుందురు దేవ,
మ్రొక్కినంతమెచ్చి చిక్కువిప్పి
మ్రొక్కు తీర్చుకున్నడొక్క చీల్తురు మీరు
శేషశైలవాస శ్రీనివాస

ఎట్టి ఆర్తినైన ఇట్టె తీర్చెదవీవు
భక్త కోటి బ్రోచు శక్తి వీవు.
మరణమెప్పుడనెడి దరయ తెలియనీవు
శేషశైలవాస శ్రీనివాస

ఆత్మయనెడి శక్తి నాదిగ సృష్టించి
దాని మనుగడ కొక తనువమర్చి
మనుజరూపమిచ్చి మహిని కల్పించిరి
శేషశైలవాస శ్రీనివాస

తప్పుచేయు వారు తమ తప్పు లెరిగిన
తప్పు చేయ తలపు దరికి రాదు,
తప్పు దారినుండి తప్పించునది నీవు
శేషశైలవాస శ్రీనివాస

తెడ్డులేని పడవ తెన్ను తెలియ కేగు
గురువు లేని చదువు గురి కుదురదు
నిను తలపని బ్రతుకు నిష్ఫలమగునయ్య
శేషశైలవాస శ్రీనివాస

జగతి ఒకటె, మనుజ జాతియునొక్కటే
తెలుపు నలుపటంచు కలహమేల?
చల్లనయ్య నీవు నల్లనయ్యవు కద
శేషశైలవాస శ్రీనివాస

## మీ కొండ మీద

ఏడుకొండలెక్కి ఏగు దెమ్మంచును
వేడ్క నీవు పిలువ వెడలి వచ్చు
పేదశిమ్ము మొదలు నీ దర్శనమ్మయ్య
శేషశైలవాస శ్రీనివాస

నిన్ను చూచునాశ నీ గుడికే తెంచి
నీదు కరుణ కోరు నిముసమందు
పొందని కసిరేరు, మొండిగ భృత్యులు
శేషశైలవాస శ్రీనివాస

శ్రమయు వ్యయము నోర్చి స్వామి నీ దరిచేర
కలుగు మదిని శాంతి, వెలుగు దోచు,
గుడికి వెలుపల నలజడి నీతి కెదురయ్య
శేషశైలవాస శ్రీనివాస

ధర్మ దరిసెనమున దరి చేరువారల
హెచ్చు దయను చూచి మెచ్చెదవని
కొందరందురయ్య కొండలయ్యానిను
శేషశైలవాస శ్రీనివాస

నిన్ను నమ్మినట్టి సన్నుతాత్ములెపుడు
నిన్ను మది దలచుచు, నిదుర పోవ
పీడకలలు రావు, పాడు చింతలు రావు
శేషశైలవాస శ్రీనివాస

గడ్డి వాములన్ని గడియలో బూడిదౌ
చిన్న నిప్పు రవ్వ చిందగానె,
మ్రొక్కినంత పోవు నొక్కట పాపాలు
శేషశైలవాస శ్రీనివాస

దూరభారమనక చేరగ నీదరి
దొరుకునీ దరిసెన మరనిముసము
విడిచి వెడలలేము, విడువరునిలువంగ
శేషశైలవాస శ్రీనివాస

## సేవలు

తెల్లవారు వేళ చల్లని గాలిలో
మేలు కొలుపు గీతి నాలపింప
వినుచులేచి మీరు జనుల దీవింతురు
శేషశైలవాస శ్రీనివాస

తొలుత చేయు పూజ తోమాల సేవలో
మనసుకింపు కూర్పు మహితమూర్తి
అందమెల్ల నీకె చెందును నా తండ్రి
శేషశైలవాస శ్రీనివాస

వేయి పేర్ల నిన్ను వేనోళ్ళ పొగడగ
మురిసి వరములొసగు గరుడ గమన
నిన్ను వినుతి సేయ నేనెంత వాడను
శేషశైలవాస శ్రీనివాస

నిండు కొలువు నందు నిఖిలేశ నీవుండ
చూడముచ్చటౌను చూపరులకు
మీ కొలువును మించి ఏ కొలువున్నది?
శేషశైలవాస శ్రీనివాస

తినగ తినగ తీపి తినలేమటందురు
నీ ప్రసాదము రుచి నెరి నెరుగక
నీ ప్రసాదమునకు నీ ప్రసాదమె సాటి
శేషశైలవాస శ్రీనివాస

విశ్వరూప నిన్ను వీక్షించు వేళలో
నన్య విషయ చింత అంతమగును.
చెంత నీవు కలవు, చింతించు టెందుకు?
శేషశైలవాస శ్రీనివాస

పవ్వళించు మనుచు పట్టు పానుపు వేసి
పాట నొకటి పాడి, పాలనిచ్చి
శయ్య చేరులోన, స్వామి లెమ్మందురు
శేషశైలవాస శ్రీనివాస

నీవొక కునుకు పడ, నిఖిల జగము నిల్చు
నందుకొరకె నిన్ను ననవరతము
కన్ను మూయకుండ కావలి యుంగుము
శేషశైలవాస శ్రీనివాస

నిత్య పూజలందు నీ భక్తుల కతన
దొరలు దొసగులన్ని పరిహరింప
విధిగ చేసెదరు పవిత్రోత్సవము దేవ
శేషశైలవాస శ్రీనివాస

అతి మనోహరమగు అద్దాల మహలులో
ఊయలూగు మీదు హొయలు చూడ
విశదమౌను మీరు విశ్వరూపులనుచు
శేషశైలవాస శ్రీనివాస

స్వామి మీ పదములు స్వర్ణ పద్మములతో
ప్రేమ సేవ చేయు వేళలందు
మిమ్ము చూచి మేము మమ్మె మరతుమయ్య
శేషశైలవాస శ్రీనివాస

కొండలయ్యా అనుచు, గోవిందుడా అంచు
వెంకటేశ అనుచు వేల పేర్ల
కొలుచు వారి కీవు కొంగు బంగారము
శేషశైలవాస శ్రీనివాస

ఎన్ని పూజలయ్యా ఎన్ని ఉత్సవములు
ఎన్ని వాహనమ్ము లెన్ని సేవ
లెన్ని వేడ్క లెవరి కిన్ని వైభవములు
శేషశైలవాస శ్రీనివాస

బ్రహ్మతానె వచ్చి బ్రహ్మోండముగ మీకు
జరుపు ఉత్సవముల నరయు కొరకు
చాలదొక బతుకల మేలు మంగా పతీ
శేషశైలవాస శ్రీనివాస

చీకటి తొలగించి, చిత్త శాంతి నొసగి
భక్త జనుల బ్రోచు శక్తి రూప,
ఎంతగా కొలిచిన, కొంతయు తెలియవు
శేషశైలవాస శ్రీనివాస

## స్తుతి

అప్పు చేసి పెళ్ళి అతి ఘనమ్ముగ చేసి
బెట్టిదంపు వడ్డీ కట్టి అలసి
పవ్వళించినట్టి బలభద్ర సోదరా
శేషశైలవాస శ్రీనివాస

కాలు చేతులింత కదలు నంత వరకు
పరుల సేవ కాశ పడని వరకు
జ్ఞానమున్న వరకు, జన్మముంచుము, చాలు
శేషశైలవాస శ్రీనివాస

గీత చదువలయు, నీతి బ్రతుక వలె
మనసు మంచి దెలుప మసల వలయు
దేవ నిన్ను సతము సేవింప వలయును
శేషశైలవాస శ్రీనివాస

ధర్మ మనుచు దేని దలతువో మదిలోన
చేయ వలయు దాని, శ్రేయమగును,
గీతలోన మీరు రీతి దెల్పినదిదె
శేషశైలవాస శ్రీనివాస

క్లిష్టమైన పనిని కష్టించి సాధించి
మహిమ నాదని యెడి అహము వలదు
ఆచరణము మాది ఆజ్ఞ మీదే కదా
శేషశైలవాస శ్రీనివాస

తాను నిలచి యున్న ధరను కొలువ వలె
కట్టుకున్న సతిని కావగవలె
నీరజాక్ష సతము నిన్ను కొల్వగవలె
శేషశైలవాస శ్రీనివాస

ఏదియో విచార మేలనో మది గల్గ
స్వామి మిమ్ము నొక్కసారి తలచి
నంత, వంత తొలగి, శాంతి నిల్చు నెదను
శేషశైలవాస శ్రీనివాస

మనసులోన నున్న మధుర భావములను
వ్యక్త పరుప కవికి శక్తి నిచ్చి
భక్తి, రక్తి ముక్తి పరగనిచ్చెదవయ్య
శేషశైలవాస శ్రీనివాస

మనసు చెప్పినట్లు మసలుకొనగవలె,
మనసు మంచి చెప్ప మలచవలయు
మనసు మలచు శక్తి మనుజుల కీవయ్య
శేషశైలవాస శ్రీనివాస

ఇచ్చుదాని కన్న వచ్చును రెట్టింపు
ఈయవలయు, మదిని ఈయదలచి,
సర్వమిచ్చి వేయ, సాధ్యము నిను చేర
శేషశైలవాస శ్రీనివాస

వేదముల నెరుగను, వాదము లెరుగను,
పూజవిధుల తెలివి పూజ్యమయ్య,
కాని నిను తలచక క్షణమైన గడుపను
శేషశైలవాస శ్రీనివాస

ప్రణవ శక్తి మీరు, ప్రాణి కోటిమి మేము
ప్రాణముండు వరకె ప్రాకులాట
ప్రణవమొకటె నిజము ప్రాణ మనిత్యము
శేషశైలవాస శ్రీనివాస

## అన్నమయ్య

ఎన్ని కీర్తనముల నెన్ని రాగమ్ముల
ఆలపించిరయ్య అన్నమయ్య
అన్నమయ్యకన్న మిన్న ఎవరు మీకు?
శేషశైలవాస శ్రీనివాస

ఎవ్వరిని తలచిన నెయ్యది గాంచిన
నీవనియె తలంచి నిన్ను గాంచె
సన్నుతించి పాడె నన్నమాచార్యుడు
శేషశైలవాస శ్రీనివాస

అమ్మను, నిను తలచి ఆవేశమున పాడె
రక్తి కొన్ని, కొన్ని భక్తి నింపి
అన్నమయ్య పాటలన్ని నిన్గను బాట
శేషశైలవాస శ్రీనివాస

అన్నమయ్య మాటలవగాహనమ్మైన
అన్నమయ్య పాటలర్థమైన
వారు మీకు ప్రియులు, పావన జన్ములు
శేషశైలవాస శ్రీనివాస

## కృతజ్ఞత

పాలవంటి మనసు, పంచదార పలుకు
విక్రమార్కుని వలె విడని పట్టు
కల్మషమెరుగని నిగర్వి నచ్చును మీకు
శేషశైలవాస శ్రీనివాస

ముదము కూర్చు సుతులు, ముచ్చటౌ కోడళ్ళు
ఊరిని మురిపించు వారి సంతు
భక్తి కొలుచు భార్య, రక్తి నాకొసగేవు
శేషశైలవాస శ్రీనివాస

నుడివినాను దేవ నూరు పద్యాలను
నిన్ను మనసునందు నిలుపు కొనుచు
వ్రాయ శక్తినిచ్చి వ్రాయించి నావయ్య
శేషశైలవాస శ్రీనివాస

సేవకుడను కవిగ దీవించితివి తండ్రి
ఎంత కరుణనీది ఎన్నతరమె
సహకరించినట్టి సహృదయులకావు
శేషశైలవాస శ్రీనివాస

కొన్ని పద్యములను విన్నట్టి వారునా
మేలు కోరి చాల మెచ్చిరయ్య
రమకు నచ్చినవివి, తమకు నచ్చినవివి
శేషశైలవాస శ్రీనివాస

అమ్మ కరుణవల్లి అలమేలు మంగమ్మ
అభయమిచ్చె నాకు శుభమునీయ
అమ్మ మాట విని జయమ్ము నిచ్చితివయ్య
శేషశైలవాస శ్రీనివాస

తెలుగు మధుర మాట వెలదిని వేమన
పలుకు మధురము, మిము తలచినంత
మధుర కవిత నాదు మాటల రూపొందె
శేషశైలవాస శ్రీనివాస

ఏడుకొండలయ్య వేడుకొంటి నినునా
పద్యమాల కూర్చ బలమునీయ,
నిచ్చినావు గాన తెచ్చి మీ కిత్తును
శేషశైలవాస శ్రీనివాస

వేమనకివె నాదు వేల నమస్సులు
ఆంధ్ర శారదకివె వందనములు
దండములివె కోటి, కొండల రాయడా
శేషశైలవాస శ్రీనివాస

వ్రాయమనిరి మీరె, వ్రాయించినది మీరె
వ్రాయుమన్నరీతి వ్రాయుచుందు
మిమ్ము తలచి వ్రాయ సమ్మతి కద మీకు
శేషశైలవాస శ్రీనివాస

# ద్వితీయ భాగంలో

## నేడు

పొడుము పీల్చువాడు, పుడమిని పూజ్యుడు
చుట్ట కాల్చువాడు, గట్టివాడు,
నాగరికుడు పొగను త్రాగువాడు నేడు
శేషశైలవాస శ్రీనివాస

ఉన్నదున్నరీతి కన్నది కన్నట్లు
పలుకువాని కిలను పరువు సున్న
జంకు గొంకు లేక బొంకు వాడె ఘనుడు
శేషశైలవాస శ్రీనివాస

చదువు రాని వాడు చక్రవర్తిని మించె
బుద్ధి లేని వాడు గద్దెనెక్కె
మంత్రులెక్కువైరి, చింతలధికమాయె
శేషశైలవాస శ్రీనివాస

త్రాగుడాప బ్రతుకు త్యాగమే చేసిరి
నాడు, బాపు, నేడు చూడరయ్య
త్రాగకున్న తప్పు, త్రాగుటయే మెప్పు
శేషశైలవాస శ్రీనివాస

అదను దొరకగానె పదవి సంపాదించి
తనను నమ్మి నట్టి జనత మరచి
వారి సొమ్ము దోచి వర్ధిల్లుచున్నారు
శేషశైలవాస శ్రీనివాస

పనులు తీరు వరకు పాదములను బట్టి
తీరగానె వాని పేరు మరచు
కార్యవాది నీతి కట్టు బాట్లెరుగడు
శేషశైలవాస శ్రీనివాస

తనకుమేలు చేయు పనులు చేయుట కన్న
పరుల హాని కోరు పనుల చేయ
జంకరయ్య నేటి జనులిసుమంతైన
శేషశైలవాస శ్రీనివాస

వారకాంత విడిచె జారత్వమును నేడు
చోరుడాయెను పరిశోధకునిగ
గీత బోధకుండు నీతిని మరచెను
శేషశైలవాస శ్రీనివాస

చేతకర్ర లేక తాత వేగ నడచు
నేడు నడచు యువకుడీడుచుకొని
తాత బలము తోడ తను తూగ లేడురా
శేషశైలవాస శ్రీనివాస

బస్సు కొరకు వేచి భంగ పడుటకన్న
రైలు బండి కొరకు సోలు కన్న
కాలి నడక నేడు మేలాయె పనులకు
శేషశైలవాస శ్రీనివాస

నేడు పెళ్ళి జరుప నెయ్యది ముఖ్యము?
పడుచు కాదు, పెండ్లి కొడుకు కాదు
వారి కన్న మొదలు వలయు సత్రము దేవ
శేషశైలవాస శ్రీనివాస

ఈత నేర్పు వాని కీత రాదనునట్లు
పాట నేర్పువాని పాట మోటు
నేర్పు లేనివారె నేర్పరులీనాడు
శేషశైలవాస శ్రీనివాస

లక్ష్యశుద్ధి మొదలు, లాభ దృష్టి పిదప
వలయు మనిషి చేయు పనులలోన
లాభ మొకటె నేడు లక్ష్యమాయె జనుల
శేషశైలవాస శ్రీనివాస

కాకి "కావు" మనగ, కావలసిన వారు
వచ్చెదరని మునుపు మెచ్చినారు,
"కావు" మనిన నేడు, కాలువిరుతురయ్యా
శేషశైలవాస శ్రీనివాస

రామ రాజ్య మందు ప్రేమకయ్యె పరీక్ష
సీత పేరు లోక మాతయయ్యె,
పేరులేని నేటి ప్రేమకేమి పరీక్ష?
శేషశైలవాస శ్రీనివాస

పోతనార్యు వోలె పొందికైన కవిత
వ్రాయ వలయునన్న వలయు భక్తి
భక్తి కూడ నేడు భుక్తికి వశమాయె
శేషశైలవాస శ్రీనివాస

వేదమనిన నేడు వెర్రిగా చూతురు
వాదమనిన చాలు, వత్తురురికి,
వాదవేదమిపుడు వరుస పఠింతురు
శేషశైలవాస శ్రీనివాస

నిన్నమొన్న వరకు నిజమనుకొన్నది
నేడబద్ధమాయె నిశ్చయముగ,
నేటి నిజము రేపు బోటు కాకుండునా
శేషశైలవాస శ్రీనివాస

ఇంటి దీపమైన ఇల్లాలి మెచ్చక
పరుని భామ కొరకు పరుగులిడుచు
రోగగ్రస్తులగుచు రోదింతురు తుదకు
శేషశైలవాస శ్రీనివాస

పరువు విడిచి దొంగ సరుకులమ్మకమును
లెక్కలేక చేసి చిక్కిరయ్య
చిక్కి, వెక్కి ఏడ్వ దక్కునా మరియాద
శేషశైలవాస శ్రీనివాస

వాడ వదిన రీతి తోడు యువకులెప్డు
తల్లి దండ్రి మాట చెల్లనీదు
పెళ్ళి మాట నెత్తపిల్ల రోదనచేయు
శేషశైలవాస శ్రీనివాస

కష్టములను గెలువ కావలె చిరునవ్వు
ముఖము మాడ్చుకొన్న సుఖమున్న
రోదనమ్ము వలన వేదన తీరునా?
శేషశైలవాస శ్రీనివాస

ఇంటనెవ్వరైన నిసుమంత తిట్టిన
వరుస పెట్టి వారి తిరుగదిట్టి
బయట నెవ్వరనిన, బావురు మననేల?
శేషశైలవాస శ్రీనివాస

మజ్జిగన్నము తిని బొజ్జ నింపుకొనుచు
మోదమందునయ్య పేదవాడు,
తినుటకన్నియుండి, తిననేడ్చు ధనికుడు
శేషశైలవాస శ్రీనివాస

## పన్ను

అమ్మబోవపన్ను ఆదాయముకుపన్ను
దానమీయ పన్ను - దాయ పన్ను
చావగానె పన్ను - నీవె మాకిక దిక్కు
శేషశైలవాస శ్రీనివాస

దొంగ వర్తకమ్ము దొరలలా చేసెడి
ద్రోహులిప్పుడిపుడు దొరకు చుండ
వారి శిక్షకేల వాయిదా వేయుట
శేషశైలవాస శ్రీనివాస

పన్నులనెగవేసి, పరువు మంట గలిపి
జనతకొల్ల గొట్టు జాల్ములకును
మంచి చేయ కలుగు మార్గము చూపుము
శేషశైలవాస శ్రీనివాస

వచ్చినట్టి లాభమచ్చముగా చూప
మెచ్చుకొనక దాని హెచ్చు చేసి
అడ్డు లేక వేతురాదాయ సుంకమ్ము
శేషశైలవాస శ్రీనివాస

టాక్సు కట్టకుండ బాక్సులో దాచెను
బ్లాకు డబ్బు నొకడు ప్లాను వేసి
బాక్సు దొరికి పోయె, టాక్సు మిగిలి పోయె
శేషశైలవాస శ్రీనివాస

పదుల నూర్ల కోట్లు బయటకు దెచ్చిరి
దాచినట్టి ధనము ధనికవరులు
వారిపైన పన్ను వడ్డింప జేయుము
శేషశైలవాస శ్రీనివాస

పన్నుల బరువు నొక తెన్నున తగ్గింప
పాలకులకు బుద్ధి మేలు చేసి,
నిజము లెక్క చూప ప్రజలకీయవెబుద్ధి
శేషశైలవాస శ్రీనివాస

పన్ను కట్టనపుడు, పన్ను కట్టక భీతి,
కట్టు వేళ బాధ కట్ట వలసి,
బాధ, భీతిలేక పన్ను కట్టునెవడు?
శేషశైలవాస శ్రీనివాస

పన్నుతగ్గి నట్లె, పనులు తగ్గ వలయు,
ధరలు తగ్గి సరకు దొరకవలయు,
లంచగొండ్లు పోవ వాంఛనీయము దేవ
శేషశైలవాస శ్రీనివాస

## తెలుగు

కలసి మెలసి మనిన కలుగును సుఖమన్న
మంచి మాట మరచి, మమత విడచి
వెలుగు వీడి వెడలు తెలుగువానిని చూడు
శేషశైలవాస శ్రీనివాస

లక్ష్యశుద్ధి పోయె, లక్షణమేమారె
సహనదృష్టి పోయె, సమత చచ్చె
తెలుగు వాని తెలివి తెల్ల వారెను చూడు
శేషశైలవాస శ్రీనివాస

ఒక్కతాటి మీద ఒప్పుగ మనుడని
ఆంధ్ర రాష్ట్ర మొసగె నమరజీవి
మరల చీల్చ నెంచు మా యాంధ్రులను చూడు
శేషశైలవాస శ్రీనివాస

ఐకమత్యమున సమైక్యాంధ్రమునిలిపి
అమ్మ మదికి ముదము అన్నలీయ
తల్లి గుండె చీల్చు తమ్ములు చూడరా
శేషశైలవాస శ్రీనివాస

ఈ ఉగాదికైన నిసుమంత విజ్ఞత
తెలుగు వాని మదిని వెలుగ చేసి
తెలుగు నేలనింక తెగకుండగా చూడు
శేషశైలవాస శ్రీనివాస

తెలుగు నేల రెండు తెగలు చేయగ నెంచి
తన్నుకొనగ దిగిరి నిన్ను మరచి
వరద నెపము చూపి, కరువునిచ్చితివయ్య
శేషశైలవాస శ్రీనివాస

నగరిలోన గల తెలుగు సమితులు చేరి
మంచి పనులు చేయనెంచరాదొ?
కలసి మెలసి మనుట తెలుగు వారల కొను
శేషశైలవాస శ్రీనివాస

తెలుగు భాషపైన తెలుగు వానికిమోజు
కలిగి యుంట తప్పుకాదు, కాని
వేరు భాషలరసి నేరుచుకొనవలె
శేషశైలవాస శ్రీనివాస

తెలుగు తీపి అనెడి తెల్లని కీర్తికి
మచ్చ తెచ్చునట్టి పుచ్చు కవిత
తెలుగు చిత్ర కవులు తెగ వ్రాయుచున్నారు
శేషశైలవాస శ్రీనివాస

ఎక్కడైన నొక్క లెక్కగా ఊతగా
దొరలు మోటు మాట నోరువదగు
తెలిసి బూతు వ్రాయ తెలుగునకప కీర్తి
శేషశైలవాస శ్రీనివాస

మూడు సార్లు నీట ముంచి నావాంధ్రను
కూడు, వీడు లేక నాడు జనుల
వెతలనింపితయ్య, కతమేమొ తెలియము
శేషశైలవాస శ్రీనివాస

కన్నడాంధ్రములను కలిపి భాషగ చేయ
తగునటంచు బుధులు తలచుచుండ
మూలమే కవిదని మొదలాయె వాదాలు
శేషశైలవాస శ్రీనివాస

మనసులొకటిగాని మనువులు వృధయని
వెల్లడించు కథలు వేలు చదివి
తనయుడాలివిడువ, తండ్రి తల్లిని దోలె
శేషశైలవాస శ్రీనివాస

తెర వెలిగిన బొమ్మ తెలివికి ఫలితము
తెలుగు దేశమాయె తెలుగు నాట
తెలుగు గంగలోన తేలునో మున్గునో
శేషశైలవాస శ్రీనివాస

ఐదు పదులపైన ఐదో మరెన్నిదో
పదవి విరమణంపు వయసదెంతో
తెలియ కుండెనుగద తెలుగు దేశములోన
శేషశైలవాస శ్రీనివాస

తెలుగు మాటలోన తేనె తీపి కలదు
తెలుగు వాని మనసు తెల్ల కలువ
తెలుగులెచట నున్న తెలియుదురందుకే
శేషశైలవాస శ్రీనివాస

<u>నాగపూరు చూచినపుడు</u>

నాగపూరులోని నాగరికులు కట్టి
రాంధ్ర సంఘ భవనమద్భుతముగ
నీవు మెచ్చిన పని నిలుపనెవ్వరికౌను
శేషశైలవాస శ్రీనివాస

నాగపూరుననొక నాల్గామడావల
రామగిరిని కలదు రాముని గుడి
దానిగన తిరుమల తలపున బారెను
శేషశైలవాస శ్రీనివాస

రామగిరి వసించెనా మహాకవినాడు
ఖ్యాత కావ్యకర్త కాళిదాసు
అతని పేరి భవనమరయు భాగ్యముగల్గె
శేషశైలవాస శ్రీనివాస

మొయిలు రాయబారి ప్రియురాలి కొరకని
వ్రాసి కాళిదాసు వాసికెక్కె
రామగిరిని కవిత రాకుండు టొకకల్ల
శేషశైలవాస శ్రీనివాస

నాగపురముకన్న నాలుగు రెట్లుగా
కలరు బెంగళూర తెలుగువారు
సంఖ్యయున్నదయ్య సఖ్యములేదయ్య
శేషశైలవాస శ్రీనివాస

## వనితాలోకం

పొడుగు జడలు పోయె, ముడులు వచ్చె, ముడులు
కూడ పోయి కురులు కురుచనాయె
పూవుతురుమ బోవ పూబోడి బోడిరా
శేషశైలవాస శ్రీనివాస

వండి వార్చుటిపుడు వనితకు శ్రమమాయె
ఒడలి సొంపు బిగువు సడలు భీతి
చంటి పాపకిపుడు చనుబాలు కరువాయె
శేషశైలవాస శ్రీనివాస

ఇంతమగనికింట శాంతి కూర్చనిసతి
పూజకేగు గుడికి పుణ్యమెంచి,
నీవు మెచ్చునట్టి సేవలింకేలయా?
శేషశైలవాస శ్రీనివాస

ఎంత ధనమునైన ఇల్లాలికీయగ
ఇంతియేన! అనుచు, పంతమాడు
ఆడదాని ఆశకంతేల లేదయా
శేషశైలవాస శ్రీనివాస

ఎత్తుమడమ జోళ్ళు కత్తిరించిన జుట్టు,
జారు చెరగు, నొకబుజాన సంచి
నేటి ఆడవారి గోటుకు గుర్తురా
శేషశైలవాస శ్రీనివాస

కళ్ళజోడు లేక కంటి చూపే లేదు
జడలు రెండు లేక పడుచు కాదు
చీర కట్టుకొనెడి చేడియలరుదైరి
శేషశైలవాస శ్రీనివాస

సందెవేళ మగడు సంతసమున రాగ
చెంత చేరవలయు కాంత, చూడు
మగని మరచి వెడలు మహిళా సభకు వేగ
శేషశైలవాస శ్రీనివాస

మాట నేర్చినట్టి మాయదారి పడతి
పురుష జాతి జూచు పురుగు వోలె
పురుషు నీడ లేక తరుణులు మనలేరు
శేషశైలవాస శ్రీనివాస

నడక, కట్టు, జుట్టు, నడత, నుడువు నందు
పురుషువోలె మెలగు తరుణి నేడు,
మీసమెక్కడయ్యా మించగ పురుషుని
శేషశైలవాస శ్రీనివాస

ఆడవారడుగుదురార్థిక స్థాయిని,
స్థాయివలయు స్త్రీకి సాంఘికముగ
శీలమున్న నాడు స్త్రీలు మా దైవాలు
శేషశైలవాస శ్రీనివాస

పసుపు మోమునద్ది, ఫాలాన బొట్టుంచి
కాటుక కనులకు తేట రాయ
సుందరాంగి వెలయు శుభ లక్షణములతో
శేషశైలవాస శ్రీనివాస

కంచి పట్టు చీర కాంతుడు కొనియివ్వ
కట్టి పిలుపుకేగి, కాంత అచట
చెలులు కట్టు నూలు చీరలు మెచ్చును
శేషశైలవాస శ్రీనివాస

బొట్టు పెట్టుకొనదు, చుట్టు కొనదు చెంగు
రంగులను ముఖాన రంగరించు
బట్టబయలు రూపు, బట్టలుండియుకూడ
శేషశైలవాస శ్రీనివాస

సూది మోయలేని సుకుమారి కోడలి
పిలిచి మామ స్వర్ణ కలశమీయ
భారమనక నెత్తిపై దాల్చె సుకుమారి
శేషశైలవాస శ్రీనివాస

ముత్యమంత పసుపు, ముఖమెంతయో చాయ
యనుచు చెప్పెను కవి, మనసు విప్పి
పసుపు రాచికొనెడి పడతి ఏదీనాడు
శేషశైలవాస శ్రీనివాస

పుట్టినింట చీర కట్ట నేర్చిన చాన
మెట్టినింట చీరనిట్టె విడచి
పతికి చెందు సొగసు, పరులకు జూపురా
శేషశైలవాస శ్రీనివాస

## ఓటు

ఓటు కొరకు జనుల, మాటల మెప్పించి
గెలువగానె వారి విలువ మరచి
నమ్మినట్టి జనుల నట్టేట విడుతురు
శేషశైలవాస శ్రీనివాస

ఓట్లు వేయుజనుల కోర్కె ముఖ్యగుణము
ఓట్లు పొందువారి కోర్కె హెచ్చు
ఓర్పులోనె ముగియు ఓటర్ల బతుకులు
శేషశైలవాస శ్రీనివాస

## పోరు

నేలకొరకు పోరు, నీటికొరకు పోరు
మింటి కొరకు పోరు, ఇంట పోరు
భాష కొరకు పోరు భరత భూమిని వచ్చె
శేషశైలవాస శ్రీనివాస

నదుల నిచ్చినావు నరులకు బ్రదుకగ
నీరు పంచుకొనగ పోరు వచ్చె
కరువు పెరుగ జొచ్చె, తరుగుచున్నది నీరు
శేషశైలవాస శ్రీనివాస

చంద్రలోకమునకు చెంగు చెంగున పోయి
తిరిగి వచ్చినట్టి పరువు పొంది,
పోరులోన దొరలి పొరలు చుంటిమి నేడు
శేషశైలవాస శ్రీనివాస

ఊరుపేరు లేని ఉన్మాదులెందరో
పేరు కొరకు నిలచి పోరు సలుప
ఊరు వదలి పోయి రుత్తములందరు
శేషశైలవాస శ్రీనివాస

పదవి కొరకు పోరు, పెదవి కొరకు పోరు,
మదిర కొరకు పోరు, మహిని దేవ
పోరు లేదు మిమ్ము కోరి కొలుచు వేళ
శేషశైలవాస శ్రీనివాస

## పేక

పేకముక్కకెవరు పేరు పెట్టిరొకాని
నాటినుండి దాని ధాటికెదురు
లేదు నేటి వరకు, రాదు ముందు కూడ
శేషశైలవాస శ్రీనివాస

## చిత్రసీమ

ఒక్క వెకిలి నాట్య మొక కత్తి యుద్ధము
బూతు పాటలొక్క బుర్ర లేని
వలపు కధను తీయ చలన చిత్ర మగును
శేషశైలవాస శ్రీనివాస

రంగభూమి మీద రాణకెక్కిన నటు
డాత్ర పడుచు పోయె చిత్ర పురికి
అచటి నటన చూచి ఆశ్చర్యపడెనట
శేషశైలవాస శ్రీనివాస

చేతిలోననొక్క చిల్లిగవ్వయులేని
చిత్రవ్యక్తి తీసె చిత్రమొక్క
టతని కప్పునిచ్చిమతి తప్పిరితరులు
శేషశైలవాస శ్రీనివాస

సరిగమలను చేర్చి సరిగ పాడగ లేని
గాయకుండు కూర్చు గాన ముద్ర
దానివినెదమయ్యె, తల నూపుదుము మెచ్చి
శేషశైలవాస శ్రీనివాస

సెక్సు చూపరాదు, చెడిపోదురది చూడ
క్రూర ఘట్టములను కూర్చరాది
వన్నియున్న ఫిల్ము వర్జింపగా 'రూలు'
శేషశైలవాస శ్రీనివాస

"రూలు" మార్చబడెను, వీలు లేకున్నచో
చూపవచ్చు సెక్సు, చూపవచ్చు
క్రూర ఘట్టములను, మీరరాదటమితి
శేషశైలవాస శ్రీనివాస

చిత్రసీమ జరుగు చిత్ర విచిత్రాలు
నేటితార రేపు నేలరాలు
నిన్నలేని యామె యున్నతనటినేడు
శేషశైలవాస శ్రీనివాస

పాటపాడు టొకరు, మాటలాడు టొకరు,
మాట, పాట, భాష మచ్చుకైన
తెలియనట్టి పడుచు తెరపై మహానటి
శేషశైలవాస శ్రీనివాస

పాట తనది కాదు, మాట తనది కాదు,
ఎత్తు తనది కాదు, జుత్తు లేదు
ఇన్ని లేని వాడె, హీరో సినీ సీమ
శేషశైలవాస శ్రీనివాస

## వలపు

ఒకరి విడచి ఒకరమొక్క క్షణము కూడ
నిలువ జాలమనెడి వలపు జంట
పెండ్లి అయిన పిదప, పెడమోము నెడమోము
శేషశైలవాస శ్రీనివాస

డెబ్బదేండ్ల మామ్మనబ్బురంబుగనెంచి
పెండ్లియాడె నిరువదేండ్ల యువకు
డామె బిడ్డలగననతనికి ముదమట
శేషశైలవాస శ్రీనివాస

కుర్రదాని వలచె కుర్రవాడొక్కడు
పెద్దలకు తెలుపగ వెరచిరయ్యొ
భావిలేదనుకొని బావిలో దూకిరి
శేషశైలవాస శ్రీనివాస

## ఆస్తి

మనిషి మీద మమత, మనినన్ని నాళ్ళుండు
మనిషి పోవగానె, మరతురతని,
అతడు విడిచినట్టి ఆస్తి విడువరయ్య
శేషశైలవాస శ్రీనివాస

వంశముద్ధరించు వరపుత్రుడని నమ్మి
తండ్రి కష్ట పడును తనయుకొరకు
ఆశలన్ని తీర్చ ఆస్తి పాలడుగురా
శేషశైలవాస శ్రీనివాస

అన్నదమ్ములందు ఆస్తికై కలహము
నడిచె కోర్టులోన నలువదేండ్లు
అంతరించె వంశమాస్తియు హరియించె
శేషశైలవాస శ్రీనివాస

చేతనున్న ఆస్తి చెప్పదురా స్థితి,
లేనినాడు తెలియు, లేని కొరత
ఉండి లేని వారలున్నారు భువిలోన
శేషశైలవాస శ్రీనివాస

వేళకు కొరగాని వేల మిత్రులకంటె
ఆప్త మిత్రుడొకడె అధికుడెన్న
ఆస్తి ఎంతయున్న ఆరోగ్యమేమిన్న
శేషశైలవాస శ్రీనివాస

## రెంట్ కంట్రోల్

అప్పుతీర్చనెంచి అద్దెకిచ్చినకొంప
అప్పు తీరినంత, అడుగతిరిగి,
నాడు మనని వీడు నేడెందుకనిరయ్య
శేషశైలవాస శ్రీనివాస

## ధరలు

చెరకు పంట లేమి చెడ లేదు చూడగా
పంచదార ధరను పెంచినారు,
నోటి కింత తీపి నోచుకోమైతిమి
శేషశైలవాస శ్రీనివాస

ధరలు పెరిగెనంచు కరువు భత్యము పెంచ
తక్షణమ్మె పెరుగు ధరలు మరల,
కరువు పెరుగకుండ కరుణించవోదేవ
శేషశైలవాస శ్రీనివాస

తగ్గు ముఖము పట్టె ధరలను కొనుచుండ
పెరుగుచున్నవేమి మరల స్వామి?
ధరలనదుపు నిడుట తమ చేత కాదేమి?
శేషశైలవాస శ్రీనివాస

## నాటి పురాణాలు - నేటి మనం

రామకథ నెరుగరు, రాధిక నెరుగరు,
భారతమ్మెరుగరు భరత పుత్రు
లరయ భరత భూమి మరచెదరో ఏమొ?
శేషశైలవాస శ్రీనివాస

పాలకడలి లేదు, పడతి మోహిని లేదు,
మ్రింగ శివుడు లేడు, మిగిలె విషము,
దాని త్రాగి జనులు దనుజుల మించిరి
శేషశైలవాస శ్రీనివాస

ఆంజనేయువాల మసహజమని చర్చ
తోక లేని నరుల లోకమందు,
తోక కలదొ లేదొ, తోడాయె నరునకు
శేషశైలవాస శ్రీనివాస

కుల జనుల కలహము కురు పాండవుల పోరు,
కాదు కదన మంచు వాదమిపుడు,
రణమొకాదొమనకు రాజ నీతినిదెల్పె
శేషశైలవాస శ్రీనివాస

రామకథను చదువ రామ, రామా 'బోరు'
భారతమ్మనంగ పరమ 'బోరు'
సెక్సు కథలు చదువ చెప్పంగ పని లేదు
శేషశైలవాస శ్రీనివాస

లంకలోన నేడు లంకాధిపతులేరి?
రమ్య భారతాన రాములేరి?
రామకథను బోలు రమ్య కవిత లేవి?
శేషశైలవాస శ్రీనివాస

దశరథాత్మజుడొక దయలేని వాడని,
స్వార్థపరుడు, కార్య సాధకుడని
వ్యక్తపరుప నెంచు వ్యక్తులు కలరిట
శేషశైలవాస శ్రీనివాస

రామరామ యనిన ప్రేమను కురిపించి
కలుషములను ద్రోలి, కలిమినిచ్చి
కాచురామ చంద్రు కలుషాత్ముడందురే!
శేషశైలవాస శ్రీనివాస

"జోగ్"

జగతి గొప్ప "జోగు" జలపాతమున నేడు
నీరు లేక నిలువు నారిపోయె
జలము లేని "జోగు" కలలోని పలుకాయె
శేషశైలవాస శ్రీనివాస

## నాయకులు - పాలన

భరత దేశమనిన పరదేశములకీసు
పరుల బాధలందు పాలు మనకు,
స్వజనసుఖమరయని స్వపరిపాలనమేల?
శేషశైలవాస శ్రీనివాస

నన్ను నమ్మి మీరు నాయకునిగ చేసి
కనుడు నాదు శక్తియనుచు వదరి
నాయకత్వమీయ నయగారములు పోవు
శేషశైలవాస శ్రీనివాస

తనదు కొంపదిద్దు కొనలేక యేడ్చెడి
పిరికి వాని పలుకు విశ్వసించి
వాని పెద్ద చేయు వారవివేకులు
శేషశైలవాస శ్రీనివాస

సిండికేటుగాని - ఇండికేటే గాని
జనత సేమమెంచు మనసులేదు,
తప్పులెంచుకొనుచు ముప్పు పాలైతిమి
శేషశైలవాస శ్రీనివాస

పేదరికములేని పెద్ద సమాజమ్ము
పెంపుచేయ నెంచు పెద్ద కోర్కె,
చెప్పు వారెకాని చేయువారే లేరు
శేషశైలవాస శ్రీనివాస

ధనము చేత నున్న పనులౌను చరచర,
పలుకుబడిని కూడ సులభమౌను,
"రూలు" నమ్మినడువ రూఢి కార్యపుచేటు
శేషశైలవాస శ్రీనివాస

ఇంట ఆలితోడ ఇంత పలుకలేని
శంర బయట నిలచి సూక్తులాడ
వానిమెచ్చుకొనెడి వాజెమ్మలున్నారు
శేషశైలవాస శ్రీనివాస

"మైకు" చేతికీయ మేకులా భాషించు
వక్తలుగలరయ్యా వందవేలు,
మాటలాడురీతి మసలు వారరుదయ్యా
శేషశైలవాస శ్రీనివాస

తానుమారకయె ఇతరులమారగగోరు
వాడునేతకాడు, వంచకుండు,
జనులసేమమెంచి పనుల చేయును నేత
శేషశైలవాస శ్రీనివాస

పెరిగెనిప్పుడు మన పరపతి జగములో
పరులు మెచ్చు ప్రగతి బడసినాము
కరువు కాటకాల నరికట్ట వలయును
శేషశైలవాస శ్రీనివాస

మాటనిలుపుకొనుట మానధనులవిధి
మానరక్షణమ్ము మహిళకు విధి
దేశ రక్షణమ్ము దేశనేతల విధి
శేషశైలవాస శ్రీనివాస

ఒకరికొకరు హింస నొనరింపయత్నింప
తొలగ చేయవలెను దొరలు దాని,
తొలగ చేయకున్న తొలగవలె దొరలు
శేషశైలవాస శ్రీనివాస

ధరలనదుపు చేయ దొరల నిర్ణయమాయె
నిర్ణయమ్ము లెంత నిబ్బరమ్మొ
తెలియునంత వరకు నిలుపుమా పాలన
శేషశైలవాస శ్రీనివాస

కడుపు నిండ తిండి, కట్టు కొనగ బట్ట
మనుట కొక్క కొంప మనిషి కమరు
పనిని చేయునట్టి పాలనమెక్కడ
శేషశైలవాస శ్రీనివాస

బ్రతుకు తెరువు లేని బడపాయిలను తెచ్చి
పదవిలోన నుంచి ఫలితమేమి?
చేతకాని వాని చేత పూవే ముల్లు
శేషశైలవాస శ్రీనివాస

ప్రజలకేమి వలయు పాలకుల కెరుక,
వారికేమి వలయు వీరికెరుక
అందరికి వలయున దంత తమకెరుక
శేషశైలవాస శ్రీనివాస

రాజకీయమిపుడు రణరంగమాయెను
వెదకి చూడ జగతి వెతల పుట్ట
భయము ముప్పిరి గొన పారిపోయెను శాంతి
శేషశైలవాస శ్రీనివాస

భరత భూమి వీడి పరదేశములకేగి
భాగ్యవంతులైన భరత సుతుల
కాశచూపగానె దేశ ప్రేమ పెరిగె
శేషశైలవాస శ్రీనివాస

## మోసాలు

నీతి వాక్యములను రీతిగ నుడువుచు
దేశ సేమమెతన ధ్యేయమనెడి
స్వామి సంజె వెడలు కామిని వెదకుచు
శేషశైలవాస శ్రీనివాస

ఉత్తరాలు చేరుటుత్త మాటరనేడు
తంతి కన్న జాబు కొంత మేలు
పోస్టు శాఖ చేయు పొరపాట్లు కొల్లలు
శేషశైలవాస శ్రీనివాస

కన్నతల్లికన్న మిన్న భరత మాత
మాతృ భూమి యశమె మనకు ఘనత
మాతనమ్మజూపు ఘాతకులున్నారు
శేషశైలవాస శ్రీనివాస

దైవ కార్యమనుచు ధర్మకార్యమనుచు
ధనము సేకరించుమనుజులేలా?
ధనము దాచిపెట్టి ధర్మము మరతురు
శేషశైలవాస శ్రీనివాస

ఎవ్వరేమి యన్న నవ్వుచు గ్రహియించి
తెలివిగాను తీయ పలుకులాడి
తుదకు మోసగించు తుచ్ఛునమ్ముదురయ్య
శేషశైలవాస శ్రీనివాస

అధిక లాభమందనభిలషించననుచు
కల్లబొల్లి కబురులల్లి చెప్పి
అమ్మునపుడు నీతి నవలనుంచువణిక్కు
శేషశైలవాస శ్రీనివాస

అన్నమందురాళ్ళు వెన్నలోపల పిండి
నిజము పాలలోన నీళ్ళు కలుప
కమ్ము వాని నోట దుమ్మందురెందుకు?
శేషశైలవాస శ్రీనివాస

మన పురాణములను వినగను, చదువగ
తేట తెల్లమౌను మాట ఒకటి,
ఇంద్రుకంటె నీతి హీనుడు మరిలేడు
శేషశైలవాస శ్రీనివాస

రాతి గుండెకన్న నాతి గుండె కరకు,
పంచదార కన్న పలుకు తీపి,
మంచి చేయ బోవ వంచన మెదురాయె
శేషశైలవాస శ్రీనివాస

బాపుజీ జయంతి, బుద్ధ జయంతుల
మాంస విక్రయమ్ము మానుడనిన
కొట్టు మూసి ఇంట, గుట్టునమ్ముదురయ్య
శేషశైలవాస శ్రీనివాస

కపటమేమి లేక, చపల మేమియు లేక
కలుషమేమి లేక మెలగు వాని
చూప, నీకు కూడ, చూడ కష్టమ్మాయె
శేషశైలవాస శ్రీనివాస

బ్రతికియున్న వారినతి హీనముగ చూచి
బ్రతుకు ముగియగానె నుతులొనర్చు
బంధువర్గమనిన భయమగు మదిలోన
శేషశైలవాస శ్రీనివాస

## విజయదశమి

రామలీలలనుచు రావణ ప్రతిమల
దహనమౌను విజయ దశమినాడు
కాలును ప్రతిమలు, కాలదు స్వార్థము
శేషశైలవాస శ్రీనివాస

పుట్టినింటినుండి మెట్టిన ఇంటికి
పదవదివసమందు పార్వతమ్మ
విజయమాయెగాన విజయదశమినాడు
శేషశైలవాస శ్రీనివాస

పాపముల పదింటి బాపుకొనగ నాశ్వ
యుజముదేవి పూజకుత్సహించి
దశ దినముల జనులు దసరాయటందురు
శేషశైలవాస శ్రీనివాస

విరటు గోవుల సెర విడిపించి, జమ్మిపై
దాచియున్న ఆయుధాల దెచ్చి
విజయుడందెజయము, విజయ దశమినాడు
శేషశైలవాస శ్రీనివాస

## వైద్యం

ఎన్ని జబ్బులున్న అన్ని మందులు, కల
వన్ని పనికి వచ్చునన్ని విధుల,
చావు దగ్గరైన చల్ల బడునివెల్ల
శేషశైలవాస శ్రీనివాస

మొండి జబ్బుకొకరు, గుండె జబ్బు కొకరు
కంటి కొకరు, పిప్పి పంటికొకరు
కలరు వైద్యులిటులె, కలవారికెందరో
శేషశైలవాస శ్రీనివాస

## లాయరు

దొంగ సాక్ష్యమునకు దోహదమీయక,
నీతి, నిజము, పాప భీతి విడక
న్యాయముగ జరించు న్యాయవాదుల చూపు!
శేషశైలవాస శ్రీనివాస

ఫీజునిచ్చు వరకు ప్లీడరు గట్టిగా
వాదమాడునయ్య బల్ల గ్రుద్ధి,
ఫీజు తప్పెనేని విరమింప జూచును
శేషశైలవాస శ్రీనివాస

## బొంబాయి

బాంబె నగరి లోన భానుడుదయమౌట
ఏడు(7) పైన స్వామి, ఏమి గతమొ?
నీకు మమ్ముగావ నిలువు జీతముకద
శేషశైలవాస శ్రీనివాస

అంబరమ్ము తాకు హర్మ్యాలు గలవెన్నొ
సంబరాల నగరి బాంబెలోన
చూడ మెడలు నొప్పి, చూడకతప్పదు
శేషశైలవాస శ్రీనివాస

లేడి పరుగు లిడును లేచిన క్షణమందె
నడతురట్లె ఇచటి నాగరికులు
కారులందు పరుగు కడలి అలలవోలె
శేషశైలవాస శ్రీనివాస

నిద్ర లేక మనిషి నీరసమై పోవు,
పగలు రాత్రి యొకటె పరుగులిచట,
నిద్ర నెరుగనిపురి, నిత్యమనోహరి
శేషశైలవాస శ్రీనివాస

కడలి నడుమ గుహల కమనీయ శిల్పాలు
కనగ, కనులు చెదరు, మనసు కదలు,
శిధిలమాయెను శిలలధముల హస్తాల
శేషశైలవాస శ్రీనివాస

## విరుద్ధాలు

వానకాలమందు వర్షముకరువాయె
ఎండకాలమందు కుండ పోత
కూయవలయు వేళకునుకు తీయు కోడి
శేషశైలవాస శ్రీనివాస

ఆడు వారి మెడల నాభరణాల్ మోటు
పురుషులందు మీసమరుదు నేడు
మగువలూరి మీద, మగవారు వంటింట
శేషశైలవాస శ్రీనివాస

మంచి భోజనమ్ము మాత మమత నిడ
కెలికి విడచి, హొటలుకేగియచట
సున్నపన్నము తిని సుఖమను సుతుడయ్య
శేషశైలవాస శ్రీనివాస

వనిత విడచె వల్లె వాటు వాటమ్ముగా
యువకుడు విడచెనుర, ఉత్తరీయ
మిరువురును విడచిరి వరుసగా సిగ్గును
శేషశైలవాస శ్రీనివాస

దేశమార్థికముగ తేజరిల్లు కొరకు
వ్యయము మితము చేయవలయునంచు
తెలుప, ఖర్చు చేసి తిరుగుదు రూళ్ళన్ని
శేషశైలవాస శ్రీనివాస

అర్థ శాస్త్రమందు అతి పండితుండని
పేరు పొందినట్టి పెద్ద మనిషి
వచ్చు జీతమందు వ్యయమునిముడ్చుడు
శేషశైలవాస శ్రీనివాస

వానలుండవలయు, వరద లేల, స్వామి,
ఎండలుండవలయు, మండుటేల?
గాలియుండవలయు గాడుపెందుకు స్వామి
శేషశైలవాస శ్రీనివాస

భూమినీదు సృష్టి భూకంపమేలయ్యా?
వానతోడ పెను తుఫాను లేల?
కొండలందు నగ్ని గోళమ్ము లేలయా?
శేషశైలవాస శ్రీనివాస

భారతీయులదగు పరిణయ పద్ధతి
నచ్చ దొడగె వేరు నాడులందు,
పరుల పద్ధతులిట పాటింప నెంతుము
శేషశైలవాస శ్రీనివాస

పాప పంకిలమ్ము పారద్రోలు ననుచు
గంగమునుగ నెంచి కాశికేగ
గంగనీరు పరమ కలుషమై పోయెను
శేషశైలవాస శ్రీనివాస

కొడుకు రాముని వలె, పడతి సీత వలెను
నడువ కోరునయ్య నరుడు, చూడ
తాను మాత్రముండు దానవు పోలిక
శేషశైలవాస శ్రీనివాస

డబ్బు చేత లేక నబ్బాయనెడు వారు,
తినుటకేమి లేదననెడివారు
క్రొత్త చిత్రమునకు వత్తురు తప్పక
శేషశైలవాస శ్రీనివాస

చిత్ర మందిరాలు, చిరుతిళ్ళ హోటళ్ళు
పెరుగు పాపమట్లు వేల కొలది
తలను దాచుకొనగ తగిన కొంపలు లేవు
శేషశైలవాస శ్రీనివాస

## సుందరకాండము

కావ్యలోకమందు దివ్యమౌకావ్యము
రమ్యము రసమయము రామ చరిత
మందు సుందరమ్ము సుందరకాండము
శేషశైలవాస శ్రీనివాస

## మాట

మాట నీయరాదు, మాట తప్పగరాదు
మాటకున్న విలువ మరువరాదు
మాట విలువ లేక మానవతయె లేదు
శేషశైలవాస శ్రీనివాస

నిజము బయట పడును నిలకడమీదనే
పొల్లు పెరుగు తీగలల్లురీతి
నిజము నాడు వాడు నీ దయకర్హుడు
శేషశైలవాస శ్రీనివాస

మాటలాడునట్టి మనుజుని కంటెను
మాటరాని కుక్క మహిని మేలు
విలువ లేని మాట పలుకనేమి ఫలము
శేషశైలవాస శ్రీనివాస

బ్రతుకులోన మనిసి బాగుపడగ నెంచ
పనికి రాని పలుకు పలుకరాదు
గట్టి పట్టు పట్టి గట్టెక్కవలయురా
శేషశైలవాస శ్రీనివాస

అనృతమెప్పుడాడ జనదని సుతులకు
తండ్రి చెప్పితానె తప్పు చేయు
తండ్రి మాటకు వెల తనయుడెట్లీయును
శేషశైలవాస శ్రీనివాస

## బెంగుళూరు

బెంగుళూరులోని పెద్ద చెట్లన్నిటి
నరికి వేసిరయ్య, నగరి పెంచ
వేసవెరుగని పురి, వేడెక్కుచున్నది
శేషశైలవాస శ్రీనివాస

## టెలిఫోను

ఫోను మ్రోగగానె తానెవ్వరో తెల్ప
వలయునవలి వైపు పలుకు వ్యక్తి,
కాని "హల్లొ" యనును, కాకున్న లేరను
శేషశైలవాస శ్రీనివాస

## ఇంజనీర్లు

నేటి ఇంజనీర్లు నిర్మించు ప్రాజెక్టు
కొలది నాళ్ళలోనె కూలి పోవు
ఇంజనీర్ల ఇళ్ళు ఇసు మంతకదలవు
శేషశైలవాస శ్రీనివాస

ఇల్లు కట్టనేర్చు ఇంజనీర్విద్యార్థి
కట్టుదిట్టమైన కట్టడముల
నిట్ట నిలువు గూల్చు నిర్విచారమ్ముగ
శేషశైలవాస శ్రీనివాస

వంద ఏళ్ళ వరకు పరిమితినూహించి
కట్టె నాన కట్ట కాటనుదొర
వందపైన గడిచె, కదలక నిలచెను
శేషశైలవాస శ్రీనివాస

విశ్వఖ్యాతిగనిన విశ్వేశ్వరయ్యను
విస్మరించరాదు, విజ్ఞులెపుడు
వారి మరచి నడచు వారు కృతఘ్నులు
శేషశైలవాస శ్రీనివాస

## కవిత్వం

కవితలోన వలయు కల్పనాచాతురి
వర్ణనలు రసమ్ము వరలవలయు
అట్లు గాని మాటలవి కావ్యమెటులౌను
శేషశైలవాస శ్రీనివాస

వ్రాయగలుగునపుడు వ్రాయుటయేసరి,
మెప్పు కొరకు వ్రాయ చప్పనౌను,
వ్రాయు పిదప మెప్పు వ్రాతకు చేయూత
శేషశైలవాస శ్రీనివాస

భావరహితమైన పాడు పుస్తకముల
చదువనేల? చదివి బెదురనేల?
బెదిరినట్టి మనను చెదురును పాడౌను
శేషశైలవాస శ్రీనివాస

కథల చదువు వారు కథకుల శక్తిని
వ్రాయువారు చదువు వారి శక్తి
తెలియగ, రచన కొక ఫలము సిద్ధించును
శేషశైలవాస శ్రీనివాస

బొమ్మలాటలాడు, కొమ్మపాటను పాడు,
నాట్యమాడు చేప నదులనీట
కవుల కవితలందు కల్లలు నిజమౌను
శేషశైలవాస శ్రీనివాస

ఎయిరు కండిషన్డు ఇంపైన శయ్యలు
మత్తులన్ని గల గమత్తు గదిని
అనుభవించి వ్రాతురభ్యుదయ కవితను
శేషశైలవాస శ్రీనివాస

## విశ్వనాథ

విశ్వనాథ వారు విశ్వమందుండగ
వెక్కిరించినారు, వెర్రివారు
జగతి వీడి పోగ, జయగొట్టు చున్నారు
శేషశైలవాస శ్రీనివాస

## పత్రికలు

బట్ట విప్పి పొట్ట బయట పడు విధాన
పోజు కొట్టు పిల్ల బొమ్మవేయ
పత్రికను కొనంగ, ప్రతులు దొరకవయ్య
శేషశైలవాస శ్రీనివాస

అట్ట మీద బొమ్మ, అట్ట చివర బొమ్మ
నడుమ చిత్ర సీమ నడుచు కథలు
వలయు తప్పని సరి వార పత్రికలకు
శేషశైలవాస శ్రీనివాస

## బంధుమిత్రులు

బంధువనుచు వచ్చి బాగ గౌరవమంది
వెడలి పరుల వద్ద వెక్కిరించు;
మిత్రుడెపటికైన మిన్న చుట్టముకన్న
శేషశైలవాస శ్రీనివాస

పరగనెల్ల వారి పరిచయము శుభము,
మైత్రి వలయు కొద్ది మిత్రులజత,
సన్నిహితుడు చాలు, సన్నుతాత్ముడొకడు
శేషశైలవాస శ్రీనివాస

## డిస్కో

సర్వమత విచార సభ నడిపించితి
నూరుమంది కూడ చేరలేదు,
డిస్కో డాన్సు పెట్ట, చూస్కో వచ్చిరి వేలు
శేషశైలవాస శ్రీనివాస

## బలమిమ్ము

వేమనను తలచుచు, వేమరు భక్తితో
మరల రచన సేతు సరళ రీతి
తలపు పలుకులందు బలమును నాకిమ్ము
శేషశైలవాస శ్రీనివాస

## మనస్సు

తనువు గట్టి దనుచు తలచుట తప్పయ్య,
తనువు కన్న గట్టి మనసు వలయు,
తనువు ముగియునపుడు మనసేమి చేయును?
శేషశైలవాస శ్రీనివాస

చేతదీపమున్న చెదరును చీకట్లు
మనసు చెదరదయ్య జ్ఞానమున్న,
నూనె లేని దివ్వె జ్ఞాన హీనమనము
శేషశైలవాస శ్రీనివాస

మనసు చిన్న సందు, మరి మరి ఇరుకురా
ఒక్కరొకరెలోన నొదుగవలయు
సద్గుణులను పంపి, సరియుంచవలె దారి
శేషశైలవాస శ్రీనివాస

మనసు నిలుచు చోట మనిసి నిలుచునయ్య
మనసు తెలిసెనేని మనిసి తెలియు
మనసు లేని మనిసి మన నేలనిలలోన
శేషశైలవాస శ్రీనివాస

మనసున నిదమిద్ధమని తేల్చుకొనలేని
మనిసి మనిసి కాడు, పనికి రాడు
కళ్ళు కలిగి కూడ, కళ్ళు లేవతనికి
శేషశైలవాస శ్రీనివాస

దారి అడవిలోన తప్పిన లేడిలా
మనసు దారి తప్పి మసలునేని
మనిసి తెలియ లేడు తన జన్మ కర్థము
శేషశైలవాస శ్రీనివాస

ఎండినట్టి చెట్ల నెట్లగ్ని కాల్చునో
మనుజుమనసు నట్లె మసియొనర్చు
కామక్రోధములను కలుషాగ్ని కణములు
శేషశైలవాస శ్రీనివాస

ఏనుగెట్టుల తన మేనిపై ధూళిని
జలకమాడి పిదప జల్లు కొనునొ
మానవుండటులనె మనసహమునునింపు
శేషశైలవాస శ్రీనివాస

ఊహలవలయాన నూగు నట్టి మనసు
నమ్మలేక తిరిగి సొమ్మ సిల్లు
శంకలేని మనసు శాంతముగానుండు
శేషశైలవాస శ్రీనివాస

సాగలేదు పడవ బాగలంగరువేయ,
మనిసి సాగలేడు మదిని పొగరు
లంగరు వలె దిగువ లాగి నిలుపుచుండ
శేషశైలవాస శ్రీనివాస

పెరుగు చిలికినంత వెన్న వచ్చును కద;
మనసు చిలికినంత, మనుజునాత్మ
వెలిగి, నరుని గొప్ప వేదాంతిగా చేయు
శేషశైలవాస శ్రీనివాస

తనది కాని మాట వినుట పాపమ్మని
తెలిసి, వినెడివాడు మలిన బుద్ధి
మనసు చెప్పు మాట వినువాడు విజ్ఞుడు
శేషశైలవాస శ్రీనివాస

పగలు, పగలు రగులు పాడు పనుల చేయ
మనసు కలుషమైన మనిషి కింక
నిదురలోన కూడ నిలకడ ఉండదు
శేషశైలవాస శ్రీనివాస

బీజమెదిగి వృక్షరాజమయ్యేడి రీతి
మనిషి పెరుగు మనసు మంచిదైన,
మంచి మనిషి దేశ మాతకే పూజ్యుడు
శేషశైలవాస శ్రీనివాస

మాయ యను సముద్ర మధ్యాన చిక్కిన
మనిషి మనసు వలయ మధ్యమందు
శక్తిలేనిదై విముక్తి పడయ లేదు
శేషశైలవాస శ్రీనివాస

దర్పణమ్మునందు తన రూపమును గాంచి
తన విరోధి యనుచు తలచు పిచుక,
మనుజుడట్లె తలచు, మనసు శత్రువనుచు
శేషశైలవాస శ్రీనివాస

జ్ఞానపరుల అడుగు జాడల నడువగ
మనిషి తెలియగలడు మనసు లోతు;
తెలియనట్టివాడు తెలిసికొనడు, చూడు
శేషశైలవాస శ్రీనివాస

నిలువదయ్యె నీరు, కుండ బోర్ల పడగ,
నీరు చిల్లికుండ నిలువదయ్యె
చలిత హృదయమట్లె వెలితిగానుండును
శేషశైలవాస శ్రీనివాస

వేరు నరకమెచటొ దూరాన కలదని
మదిని తలతురయ్యె మనుజులరయ
మలినమైన మనసె మనిషికి నరకము
శేషశైలవాస శ్రీనివాస

చంచలమ్ము మనసు, మంచి చూడగలేదు,
సందు గొందులందు సంచరించు;
మంచి దారినడువ మనిషికిమ్ము బలము
శేషశైలవాస శ్రీనివాస

పండుటాకురాలు, ఎండుటాకునురాలు,
రాలు నేలకట్టె, రాత ముగియ;
రాలదెపుడు నేల పాల వంటి మనసు
శేషశైలవాస శ్రీనివాస

వయసు మళ్ళినంత వచ్చు వేదాంతము
వేరె చింతనలకు దారి లేక
మనసు మారి కాదు, మనిషి మారియు కాదు
శేషశైలవాస శ్రీనివాస

మనసు చెప్పెనొక్క మంచి ఆలోచన
తక్షణమ్మె చేయ దగును దాని,
ఆచరణకు రాని ఆలోచన లవేల?
శేషశైలవాస శ్రీనివాస

మంచి వారు కలరు మహినెల్లదిక్కుల
ఎంచివారి మంచి నెరుగవలయు
తెలిసి కొనుటె మంచి, తెలియకుండుటెచెడు
శేషశైలవాస శ్రీనివాస

## ఇచ్చి, పుచ్చుకొనుటలు

ఇచ్చువాడు గలడు; పుచ్చుకొనుగలడు,
ఇచ్చి పుచ్చుకొనగ నేల బెరుకు?
ఇచ్చుట సబబైన, పుచ్చుకొనుట సరి
శేషశైలవాస శ్రీనివాస

అప్పు చేయునాతడనునెన్ని బాసలు
అప్పునిచ్చు నాతడతని నమ్మి
అప్పులాగు వాడె అతి సమర్థుడు నేడు
శేషశైలవాస శ్రీనివాస

అప్పునిచ్చు వారలవని గలరు కాన
అప్పు చేయువారలధికమైరి
ఇచ్చిపుచ్చుకొనుట ఇలలోన విధియాయె
శేషశైలవాస శ్రీనివాస

## ఆడా - మగా

బోదకాళ్ళ ప్యాంటు, బొజ్జక్రిందకు బెల్టు
చిందరై ఎగిరెడి చింపి జుట్టు
ఆడమగల మధ్య తేడాలు తెలియవు
శేషశైలవాస శ్రీనివాస

## గోల

చూపు తగ్గు వేళ కాపాడుమని గోల
మరపు హెచ్చు వేళ మదిని గోల
వయసు వ్రాలు వేళ బ్రతుకనిమ్మని గోల
శేషశైలవాస శ్రీనివాస

## మిడిల్ క్లాసు

గద్దె కొరకు పోరు పెద్దలు చేతురు
పోరు పేద,తనదుపొట్ట కొరకు
పరువు కొరకు మధ్య తరగతి పోరును
శేషశైలవాస శ్రీనివాస

## ఒక్కడే

లక్ష నదులు కాని లవణాబ్ధి యొక్కటే
పురములెన్ని యున్న ధరణి యొకటె
మతములెన్ని యున్న మానవుడొక్కడే
శేషశైలవాస శ్రీనివాస

## మంత్రాలు - యంత్రాలు

ఎంత యంత్రమైన సుంతలోపమ్ముండు
పూర్తి దాని నమ్మ బోలదెపుడు
నీదు కార్య సరణి నేర్తు రామనుజులు
శేషశైలవాస శ్రీనివాస

మబ్బుల విడ గొట్ట, మంచివాన గురియ
శక్యమనిరి యంత్ర శాస్త్రవేత్త
లైన వారి యత్నమైనది వ్యర్థము
శేషశైలవాస శ్రీనివాస

తపము, జపము చేయ తప్పక వానలు
కురియుననిరిరువురు పరమ యోగు
లైన వారి యత్న మైనది విఫలము
శేషశైలవాస శ్రీనివాస

మంత్రమైననేమి? తంత్ర శాస్త్రములేమి?
ప్రకృతికెదురేగ ప్రగతియగునె?
సహజరీతి బ్రతుకు సాగింప చేయవే
శేషశైలవాస శ్రీనివాస

## రావణులు

రామరాజ్యమందు రావణుడొక్కడే
నేటి రాజ్యమందు పేటకొకడు
బ్రతుక దలచుకొన్న వనిత బైటకురాదు
శేషశైలవాస శ్రీనివాస

రాత్రివేళ కామ రాక్షసిపై బడ
దానవుడుగ మారు మానవుండు
అపుడు జరుగునయ్య అనరాని కాండలు
శేషశైలవాస శ్రీనివాస

## చీమలు

చేత విత్తమున్న చేరుదురందరు
ధనములేని నాడు దరికిరారు
బెల్లమున్న చోట కొల్లలు చీమలు
శేషశైలవాస శ్రీనివాస

## సారా

వనితలెల్ల కూడి వలదు 'సారా' యని
వాడవాడ తిరిగి వేడుచుండ
పట్టనట్టులుంట ప్రభుతకు ధర్మమా
శేషశైలవాస శ్రీనివాస

## నీతి

పరుల సొమ్ము కొరకు, పర కాంతల కొరకు
ఇహసుఖమ్ము కొరకు, హేయమైన
వక్ర గతుల జనులు వర్తించుచున్నారు
శేషశైలవాస శ్రీనివాస

పెద్దవారుచెప్పు సుద్దులు వినవలె
మరువవలయు వారి మురికి పనులు
మాటలోని నీతి మనసులో లేదయా
శేషశైలవాస శ్రీనివాస

మాతృ దేశమెంత మహిమాన్వితమొ, బాల
బాలికలకు తెలుప వలయునేడు
రీతి, విద్యమలచి, నీతి బోధింపరు
శేషశైలవాస శ్రీనివాస

పరుగులెత్తి యెత్తి పాలు తాగుటకన్న
నిలిచి త్రాగమేలు నీరమైన
మంచి మాట మరచి మసలుదు రెందరో
శేషశైలవాస శ్రీనివాస

గగన సీమనున్న గ్రద్ద వెదకు కాదె
నేల మీదనున్న మైల చోట్లు
నీతిలేని వాడు నెమకును వ్యసనాలు
శేషశైలవాస శ్రీనివాస

కొట్టభీతిలేదు, తిట్ట భీతియు లేదు
నీతి లేక బతుక భీతి లేదు
మరణమన్న భీతి నరనరమ్ములలోన
శేషశైలవాస శ్రీనివాస

నిర్భయముగ నెట్టి దుర్భరమెదిరింప
శక్తినిచ్చినట్టి భక్త పోష
నీతి దాటలేని భీతినిచ్చితివయ్య
శేషశైలవాస శ్రీనివాస

నియయమేమిలేని నీచాత్ముమదిలోన
నీవు, రీతి, భీతి, నీతి లేవు
జీవముండి కూడ జీవచ్ఛవమతడు
శేషశైలవాస శ్రీనివాస

## రక్షాక్షి

కనులు మారెకెంపుగా గతము తలచి
ఇంకనైన సుఖములీయవలయు
నంచు ఎంచినిలిచెనదిగొ శ్రీరక్షాక్షి
శేషశైలవాస శ్రీనివాస

## ఇందిర

భరతదేశ ప్రగతి పరమార్థమని ఎంచి
సేవ చేసినట్టి దేవినెవరొ
కాల్చి కూల్చిరయ్య కఠినాత్ములేలనొ?
శేషశైలవాస శ్రీనివాస

## రాజీవు

తాతరూపు దీర్చి తనువు చాలింపగ
తల్లి తన తనువునుత్యాగమీయ
దేశసేవయె తన ధ్యేయమన్మనుమడు
శేషశైలవాస శ్రీనివాస

వయసునందు చిన్న వాడయ్యు 'రాజీవు'
పూని జనహిత, ప్రధాని అయ్యె
పదవి బరువు మోసె, ప్రాణములర్పించె
శేషశైలవాస శ్రీనివాస

## మెక్సికో

మనిషి మనుట కొరకు మహినేర్పరచితివి,
మేటి నగరమైన మెక్సికోను
మట్టు పెట్టినావు, మర్మమేమిందున
శేషశైలవాస శ్రీనివాస

## సిగరెట్

రోగహేతువు పొగత్రాగుడు కూడద
టంచు వ్రాసి విక్రయించుటేల?
అమ్మి, కాల్చుటందు ఆంక్షవేయుటదేల?
శేషశైలవాస శ్రీనివాస

## యువలోకం - చదువులు

దినమునకొక సినిమ, తినుటకు హోటలు
సంజెవేళ రోడ్డు సైడునడక
చదువు కన్న మిన్న చదువరులకు నేడు
శేషశైలవాస శ్రీనివాస

పెదవిపై సిగరెటు, చెదరిపోయిన జుట్టు
నడచు వేళ జతగ పడుచు పిల్ల
యున్న యెడల వాడు యువక వీరుడు నేడు
శేషశైలవాస శ్రీనివాస

ఆటపాటలందు అగుపడునాసక్తి
కనగరాదు చదువుకొనుట యందు
చదువు లేని ఆట ఎదలేని మేనురా
శేషశైలవాస శ్రీనివాస

తల్లి దండ్రుల మది తగు ముదమ్మున నిండ
పట్టు పట్టి విద్య పడయునపుడె
ప్రేమకుగల అర్థమేమిటో తెలియును
శేషశైలవాస శ్రీనివాస

## రాళ్ళపాలు

రాజుసురు విడువగ, రాణిమానము వీడె
వీరి బిడ్డలైరి వీధిపాలు
రాజులెందరిటులె రాళ్ళ పాలైరేలొ?
శేషశైలవాస శ్రీనివాస

## పెద్దమనిషి

నలుగురున్న చోట నడచుకొనుట నేర్చి
వలయునంత వరకు తెలివినాడి
పెద్ద మనిషి యన్న పేరందవలె కాదె
శేషశైలవాస శ్రీనివాస

## మితసంతానం

సంతతి మితమైన సంతోషమని యెడి
సూక్తి మెచ్చి నడువ యుక్తమేను,
యుక్తమైన పనికి యుక్తి వలయుగాదె
శేషశైలవాస శ్రీనివాస

వంశముద్ధరింప వలయునొక్క సుతుడు
వాని మించి యొకరు వలయునంట
ఇద్దరున్న ఇల్లు ముద్దుల మూటట
శేషశైలవాస శ్రీనివాస

## సుఖము

అందమునకు వాడు వంద పరికరాల
కన్న మిన్న అయిన దున్నదొకటి
దాని పేరె సుఖము, దాని దాతయె మీరు
శేషశైలవాస శ్రీనివాస

## భ్రమ

చక చక తిరుగుచు చక్రపుటంచుపై
తలచు కీటకమ్ము తనదు శక్తి
వలన చక్రమటు కదలుచున్నదని భ్రమ
శేషశైలవాస శ్రీనివాస

## కానిపనులు

లంచమీయరాదు, లంచమడుగరాదు
చేర్చిచూడ రెండు చెడ్డ పనులె
కాని పనుల చేయ, మానరుజనులేలొ?
శేషశైలవాస శ్రీనివాస

కాని పనులు చేసి, లేని గొప్పలు పోయి
దొరికి పోయినట్టి దొడ్డవారు
గడ్డి కరచినారు, నడ్డి విరిచినావు
శేషశైలవాస శ్రీనివాస

## పెద్దబాలశిక్ష

పెద్దబాలశిక్ష శ్రద్ధగా చదివిన
కలుగునట్టి బుద్ధి కొలదియైన
అన్ని చదువులకదె ఆధారమైనిల్చు
శేషశైలవాస శ్రీనివాస

## హరిసేవ

హరిజనోద్ధరణము హరిసేవయని చెప్పి
హరిజనులనటనట హరిని చేర్చు
పరమ హీనమయిన పనిని చేయుటదేల?
శేషశైలవాస శ్రీనివాస

## శౌర్యమా

ధర్మయుద్ధమందు కర్మానుసారులై
పోరుసల్పు కతన వీరులైరి
పొంచిపొడుచునట్టివంచన శౌర్యమా?
శేషశైలవాస శ్రీనివాస

## పోలీసు

నడుచువాడు కారు నడపు వానిని తిట్టు
కారు వాడు తిట్టు గాడివాని
అందరొందురొకటి నిందింప పోలీసు
శేషశైలవాస శ్రీనివాస

## మీకేనా!

దివిని కలదదేమొ, దేవ నీకె తెలియు,
భువిని చూపవయ్య, దివిని మాకు;
దివిని కల సుఖాలు, దేవ, మీకొకరికా!
శేషశైలవాస శ్రీనివాస

స్వామి మీకిరువురు, స్వాములకెందరో
రామ చంద్రునకొక భామ సీత;
రామునివలె మమ్ము ప్రేమదిద్దెదరయ్య
శేషశైలవాస శ్రీనివాస

## నాలుక

మెత్తనొత్త వలెను మేలైన చేతితో,
కనుల చూపవలెను కరుణనెపుడు
నాల్కవాడ వలెను పల్కగవినయాన
శేషశైలవాస శ్రీనివాస

## జాగ్రత్త

అవలి నుండి తలుపు నెవరు తట్టిన గాని
తెరువవలయునెవరొ తెలిసి కొనియె
తెలిసికొనక తెరువ, కలుగ వచ్చును ముప్పు
శేషశైలవాస శ్రీనివాస

## తినుట

తీపి తినగవలయు దీపావళి దినాన
చేదు, తీపి, పులుపుగాదులందు
పలురకాల తిళ్ళు కలవారికే కదా
శేషశైలవాస శ్రీనివాస

బతుకు కొరకు తినుట భావ్యము మనిషికి,
తిండి లేని బతుకు దండుగయ్య,
తినుటకొరకె జన్మమనుకొందురెందరో
శేషశైలవాస శ్రీనివాస

ఐదురూకలిచ్చి ఐసుకాఫీ త్రాగి
పదుల నోట్లనిచ్చి పచ్చికూడు
తినుట, చాల తింటిమనుట, గొప్పరనేడు
శేషశైలవాస శ్రీనివాస

తినుటకు లభియింప తినవలె, మనవలె
కడుపు నిండకున్న కడు చిరాకు
కడుపునిండెనేని కడగళ్ళు కనరావు
శేషశైలవాస శ్రీనివాస

## అనవసరం పనులు

తనకు చెందనట్టి పనులలో కేలుంచ
తగిన శాస్తియగుట తథ్యమిలను
అయిన మానరేలొ! అన్యప్రమేయమ్ము
శేషశైలవాస శ్రీనివాస

అవని పైని దినము అనుభవించుచునున్న
పాపఫలము తొలగ పాటు పడము;
గగన మండలమున కెగురనుంకింతుము
శేషశైలవాస శ్రీనివాస

సొంత నేల కొరకు సుంత శ్రమింపక
పరుల నేల పడయ పరుగు లెత్తు
జాడ్యమేల ఇలను జనులకిచ్చితివయ్యా
శేషశైలవాస శ్రీనివాస

బయట పెట్టకున్న బానిసరా, గుట్టు;
బయట పెట్ట దాని బంటుమనము;
బయట పెట్టనేల? బానిసకానేల?
శేషశైలవాస శ్రీనివాస

రాచబాటలోన రాణ నడువుమన్న
సందు గొందులందు చావనేల?
గుడికి వెడలుమనిన గుడిసెదూరుదురేల?
శేషశైలవాస శ్రీనివాస

తీర్థయాత్రకేగి, తీర్థముసేవించి
పొందినట్టి పుణ్యమందె విడచి
నిన్ను మరచి చేతురన్ని దుష్కృత్యాలు
శేషశైలవాస శ్రీనివాస

స్వార్థ రహితులట్లు సంచరింతురు వారి
మాటలేమొ తీపి, మనసు విషము
కొంగ జపము చేప మ్రింగుట కేకదా
శేషశైలవాస శ్రీనివాస

తన శరీరమందు దాగిన కస్తూరి
తనదని తెలియని హరిణము వోలె
బయట సుఖముకొరకు పరుగెత్తు మూర్ఖుడు
శేషశైలవాస శ్రీనివాస

నీటిమీదనడువ నేరుతునని చెప్పి
ముందు కడుగు వేసి మునుగినట్టి
నీచ బుద్ధియొకడు నిను మిధ్య అనునయ్య
శేషశైలవాస శ్రీనివాస

తాను చేయలేడు తన పనిని సరిగ
పరులు చేయు పనిని పరిహసించు,
వెక్కిరించు వాడె వెతలకు గురియౌను
శేషశైలవాస శ్రీనివాస

వలపు చిందు వేళ వరములంది సతులు
పతులవెతల నిడుట పాతకతయె
సత్యభామ, కైక నిత్య సాక్షులు కారె
శేషశైలవాస శ్రీనివాస

శాస్త్రములను మీరు శాసింతురనియెడి
మర్మమెరిగి కూడ మానవాళి
శాస్త్రమూలమేదొ చర్చించ బూనిరి
శేషశైలవాస శ్రీనివాస

## నగరవాసం

నగరిలోన బ్రతుకు నాగరికులమేము
పాటు పడుదుమేము, పగలు రాత్రి
పొట్టనిండదయ్య, బట్టకు కరువయ్య
శేషశైలవాస శ్రీనివాస

## మౌనం

ఒక్క యేడు పూర్తి ఒక్క మాటాడక
గడపినారు కాదె ఘన 'వినోబ'
నిమిషముండలేము నిశ్శబ్దముగ మేము
శేషశైలవాస శ్రీనివాస

## నీదె భారము

నినువిడిచి చరింతునని మాత్రమనుకోకు,
నాల్గు వందలాయె నల్లనయ్య
నీదె భారము మరి, నీదె ఈ రచనము
శేషశైలవాస శ్రీనివాస

## నేర్పరి

గతము తలచుటందు గడచు సగము జన్మ
అర్థహీనమట్టి వ్యర్థజన్మ
ప్రస్తుతమ్ము దలచి బ్రతుకును నేర్పరి
శేషశైలవాస శ్రీనివాస

## దేశభక్తి

భరత భూమి సతము పరమ పవిత్రము
భారతీయుడౌట భాగ్యముకద,,
మానమున్న మనిషి మరువ రాదీ సూక్తి
శేషశైలవాస శ్రీనివాస

భరతుడేలినట్టి బంగరు రాజ్యము
రాముదయను గన్న రాజ్యమిద్ది
నీదు చలువ వలన నిలిచియున్నది నేడు
శేషశైలవాస శ్రీనివాస

## ఇల్లు - ఇల్లాలు - పిల్లలు

బిడ్డలెందరున్న పిలిచిన పలుకగ
బిడ్డ యొకని గోర చెడ్డ కాదు
మాటవినని బిడ్డ మాటలేటికి ముద్దు
శేషశైలవాస శ్రీనివాస

తండ్రి పడెడి శ్రమము తల్లి ఇచ్చెడి ప్రేమ
నెరిగి వారి సంతుపెరుగవలయు
పెంపు వలన కలుగు సొంపు సంతతియందు
శేషశైలవాస శ్రీనివాస

మనసెరింగి నడచు మానిని యిల్లాలు
వినయ సంపదగల బిడ్డలుండ
ధనము లేక కూడ ధనవంతుడా అయ్యె
శేషశైలవాస శ్రీనివాస

ఎంతవారికైన శాంతము వలయును
శాంతమున్న చోట శాంతి యుండు
శాంతిలేని యిల్లు సంతతోసమమురా
శేషశైలవాస శ్రీనివాస

పంతమాడు పడతి, శాంతమూర్తిమగడు
చిలిపి తనము, తెలివి కలిగినట్టి
సంతతిగల యిల్లు స్వర్గధామము కదా
శేషశైలవాస శ్రీనివాస

సతినికాచెడి పతి, పతిని కొలిచెడి సతి,
తల్లిదండ్రులకు ముదమిడు సుతులు
కానవత్తురరుదుగా నేటి యుగమందు
శేషశైలవాస శ్రీనివాస

మెట్టినింటిలోన మెప్పొందు కూతురు
ఆమె చల్లనేలు అల్లుడయ్యె
కలిగినట్టి వారు కడు పుణ్యమూర్తులు
శేషశైలవాస శ్రీనివాస

ప్రక్కనున్న భార్య ప్రణయదేవతయైన
సతముసేవ నెంచు సాధ్వియైన
అట్టిభార్యను కల యతనిదే భాగ్యము
శేషశైలవాస శ్రీనివాస

మగని మాటవినెడి మగువయె మహిలోన
మాననీయురాలు మగువలందు,
మగువ నెరిగి మసలు మగవాడె మాన్యుడు
శేషశైలవాస శ్రీనివాస

## వంతెన

బ్రతుకు, దాటవలయు వంతెన వంటిది
పండుకొని గడుపగ ప్రక్కకాదు,
వంతెనకటు చేర వంతలేయుండవు
శేషశైలవాస శ్రీనివాస

## ఆటోరిక్షా

"ఆటో రిక్ష" యనెడి యమవాహనమ్మొకటి
బెంగళూరులోన వేగముగను
తిరుగుచుండునయ్య సరకు చేయక "రూల్సు"
శేషశైలవాస శ్రీనివాస

అట్టి బండి నెక్కి అవసరమ్ముగ నేగు
వారి రక్ష సేయు స్వామి వీవె,
దిగిన ప్రతియొకపరి, దివినుండి దిగుటయే
శేషశైలవాస శ్రీనివాస

"ఆటో" చాలకులకు అదుపునాజ్ఞయులేక
ఆదరించువారి బాధ పెట్ట
తగిన శిక్ష వేయుమగవారలేమైరి
శేషశైలవాస శ్రీనివాస

## గట్టిపట్టు

పట్టి విడువరాదు, పట్టువిడువరాదు
విడువ పరువు పోవు, చెడును బ్రతుకు,
కట్టుకొనగనొకతె, గట్టి పట్టునొకటె
శేషశైలవాస శ్రీనివాస

## దువ్వెన

పుడమిననుభవమ్ము పోలిక దువ్వెన,
వేగదొరకనీయవేలొదాని,
నిత్తురయ్య తుదకు, జుత్తు ఊడినవెన్క
శేషశైలవాస శ్రీనివాస

## నీరులేని బావి

సంఘమనగనేల? సంస్కారమననేల?
తోటివారికింతతోడు పడక,
నీరు లేనిబావి ఊరికి వ్యర్థము
శేషశైలవాస శ్రీనివాస

## మంచి - చెడు

అందమైన, మంచియన లేము సర్వము,
మంచివన్ని అందమనుట నిజము
మంచిలేని అందమెంచగ వ్యర్థము
శేషశైలవాస శ్రీనివాస

పరుల దోషములను పని బూని వెదుకకు,
పరుని దోషియనుట పాడికాదు,
తప్పుతాను చేసి యొప్పుట న్యాయము
శేషశైలవాస శ్రీనివాస

ఎవ్వరేని తనకు నెగ్గులొనర్చిన
మరువ వలయువాని మరుక్షణాన
మంచి చేసిరేని మరువవలదు వాని
శేషశైలవాస శ్రీనివాస

మంచి వారి మరచి మనుట ఖేదమునిచ్చు
చెడ్డవారి పంచ చేరకీడు
మంచి చెడ్డ లెంచిమనుడందురందుకే
శేషశైలవాస శ్రీనివాస

ఓడనున్న వరకు ఓడమల్లయనుచు
ఓడదిగిన వెనుక బోడిమల్ల
యనెడిసూక్తి లోకమనుసరించెడునీతి
శేషశైలవాస శ్రీనివాస

## పరపతి

పరువులేని నాడు పరపతియుండదు
పరపతి కొదవైన పనులు సున్న
పనులు సాగకున్న మనిషికి వెలలేదు
శేషశైలవాస శ్రీనివాస

## ప్రేమము

పువ్వువంటిదయ్య పూజ్యమౌ ప్రేమము
ముల్లు వంటిదయ్యమురికి కోర్కె
కోర్కె పెంచుకొనుచు, కొలువరు ప్రేమను
శేషశైలవాస శ్రీనివాస

ప్రేమ ప్రేమయనుచు పెద్ద మాటలనాడి
కట్టుకొన్న సతిని తిట్టి కొట్టు
పతులకేలరాదు సుతరాము సద్బుద్ధి
శేషశైలవాస శ్రీనివాస

జన్మదినమునందు జరుపువేడ్కలకన్న
బీదవానికొక్క బిచ్చమొసగ
నీవు వాని నోట దీవించెదవుగదా
శేషశైలవాస శ్రీనివాస

ప్రేమనిచ్చు వారి ప్రేమింపవలెగాని
చూడరాదు వారి కీడుదలచి
ప్రేమ పంచి, మంచి పెంచవలెను మది
శేషశైలవాస శ్రీనివాస

ప్రేమడబ్బు కన్నవేరెట్లు విలువది
ధనముకొనగ లేదు మనిషి ప్రేమ
మమ్ము ప్రేమ చూడు, మా ప్రేమగ్రహియించి
శేషశైలవాస శ్రీనివాస

మంచి పనులనెపుడు మరువలేరు నరులు
పరుల గౌరవింపదొరుకు చెలిమి
కరుణ చూపినంత కలుగును ప్రేమము
శేషశైలవాస శ్రీనివాస

## నయనాలు

కన్నులుండి కూడ కనలేరు కొందరు
ధనమదాన పొరలు కనులనింప,
అశ్రుపూరితమ్ము లన దలనయనాలు
శేషశైలవాస శ్రీనివాస

మంచి చెడులనెంచి మసలుకొనవలయు,
మసలుకొననివాడు మనిషికాడు,
కళ్ళు రెంటినిచ్చి కాపాడితివి తండ్రి
శేషశైలవాస శ్రీనివాస

చూడలేని వాడు కాడంధుడిల, మంచి
చూడగలిగికూడ, చూడనట్టి
వాడుగుడ్డి వాడు, వానికి కనులేల?
శేషశైలవాస శ్రీనివాస

కలల కనుటలోన గడుపరాదు బ్రతుకు
కనులు మూసినకద కలలు వచ్చు,
సతము కనులు మూసి బతుక నేమి ఫలము
శేషశైలవాస శ్రీనివాస

కనులనుండి కదలు కామ క్రోధమ్ములు;
కామదృష్టి ఎత్తి కానరాదు;
కోపమందు కనులు గ్రుడ్డివై పోవును
శేషశైలవాస శ్రీనివాస

అశ్రుపూర్ణమగునయనములగాంచిన
కష్ట కారణమును కానలేము;
కారణమెరుకౌను, కన్నీరునిల్పిన
శేషశైలవాస శ్రీనివాస

## కోరికలు

సాలెపురుగెటు తన జాలాన నిలుచునో
యట్టి మనిషి తాను కట్టుకున్న
కోర్కెలవలలోన కోరివసించును
శేషశైలవాస శ్రీనివాస

నీరు చేతికీయ నిరసించకూడదు;
దాహమెట్లు తీరు తాగకున్న;
దాహముపశమింప దరిరావు కోర్కెలు
శేషశైలవాస శ్రీనివాస

అత్యవసరమిప్పుడడుగునపడిపోయె,
కోరికలను తెలుప కోర్కె పెరిగె;
తీర్చెదమనువారు తీర్చెదరో లేదొ?
శేషశైలవాస శ్రీనివాస

## కావలెను - స్వామీ

పరుల రాజ్యమందు వారితో కలయిక
సొంత రాష్ట్రమనిన సుంత భక్తి
వలయు ప్రతి మనిషికి, విలువగ బ్రతుకగ
శేషశైలవాస శ్రీనివాస

మార్పులేనినాడు చర్చకు దిగకుండ,
మార్పువలయు చోట మార్పు తెలివి
నీయవయ్య దేవ నీ మానవాళికి
శేషశైలవాస శ్రీనివాస

మితిని మీరి దానమీయుట మూర్ఖత,
కలిగిలేదనుటిక కల్మషమ్ము,
చేయకలిగినంత చేయగమనసిమ్ము
శేషశైలవాస శ్రీనివాస

ఆపద కలిగించు నన్ృతమాడుచో,
సత్యశీలి దెపుడు సహజ సరళి
నిజమువీడలేని నిగ్రహమ్మీయవే
శేషశైలవాస శ్రీనివాస

## మితి

వైద్యునాజ్ఞ వలన మద్యముమందౌను,
విచ్చలవిడి త్రాగ విషమదౌను
మితిని మీరు నడత సుతరాము వలదయ్య
శేషశైలవాస శ్రీనివాస

వ్యయము చేయ ధనమునతిమితి తెలియక
బుద్ధి మారి మనిసి భూతమౌను
సవ్యమైన ఖర్చు సంతసమిచ్చును
శేషశైలవాస శ్రీనివాస

మొదట మనిసి తాగె మోదాన మధువును
సభ్యతయని త్రాగు, సబబనెంచి,
తుదకు మధువు త్రాగు తుదిదాక మనిసిని
శేషశైలవాస శ్రీనివాస

## ప్రణయము

ముళ్ళమధ్య పెరుగు ముచ్చటగా పూవు,
ప్రణయమట్లెపెరుగు ప్రబలరీతి,
నెంత కష్టమైన నెదిరించి, సాధించి
శేషశైలవాస శ్రీనివాస

## గమ్యం

నదులకు గలవయ్య నామాలు వేర్వేరు
వాటి గమన రీతియటులెవేరె
వేరు పేర్లు దార్లు, చేరుట జలధిలో
శేషశైలవాస శ్రీనివాస

## ఎందుకో

దారి తప్పినడచు దారుణ ప్రవృత్తి
పరులకెగ్గు తలచు పాడు బుద్ధి
మనిషికీయనేల? వాని తప్పన నేల?
శేషశైలవాస శ్రీనివాస

స్వార్థ పరునికిలను సద్గతి శూన్యము,
హీనబుద్ధి కన్న హీనమేది?
ఈర్ష్య కన్న మించి హింస ఏమున్నది?
శేషశైలవాస శ్రీనివాస

ధ్యాన సంపదగల మాన ధనులనిట
వెలయచేసినావు వెంకటేశ,
జ్ఞాన శూన్యులకిట జన్మమీయగనేల?
శేషశైలవాస శ్రీనివాస

## కోరాడ

(కూచిపూడి నాట్యాచార్యులు శ్రీ కోరాడ నరసింహారావు గారి శిష్యురాలి కార్యక్రమ సందర్భంలో చదివినవి)

తెలుగు జాతి తొంటి వెలుగు యేలూరున
తెలుగు యశము భువిని వెలుగచేయు
కొమరు, కళల నిధిని, కోరాడ గావుము
శేషశైలవాస శ్రీనివాస

నాట్య చక్రవర్తి నటశేఖరుడితడు
కూచిపూడి కళకు గురువితండు
కోమలుడు, వినయుడు, కోరాడగావుము
శేషశైలవాస శ్రీనివాస

సహజ శైలికలిగి, సరస సరళినిండి
నవరసాలు చిందు నాట్యమందు
కోటవంటివాడు కోరాడగావుము
శేషశైలవాస శ్రీనివాస

వీరి శిష్యురాలు. వీణ, మాచెలికాని
తనయ, సుగుణవల్లి, వినయశీలి
ఆమెకఖిల శుభములమరజేయుము తండ్రి
శేషశైలవాస శ్రీనివాస

బహుమతులను పొందు బాలబాలికలను
బహుమతులను పంచు సహృదయులను
సభకు శోభకూర్చు సభ్యుల బ్రోవుము
శేషశైలవాస శ్రీనివాస

భారతి (చలన చిత్ర నటి భారతినుద్దేశించి చెప్పినది)

విష్ణు వర్ధనుసతి, వినయవతి, సుశీల
చిత్ర జగతి యందు చిరయశమును
బడసినట్టి పడతి, భారతి బ్రోవవే
శేషశైలవాస శ్రీనివాస

శ్రీ సాలూరి (ప్రఖ్యాత సంగీత దర్శకులు)

భాష ఎద్దియైన పాట చేతికొసంగ
మెచ్చురీతి స్వరమునిచ్చు కూర్చు
రాగరస పిపాసి రాజేశ్వరుని బ్రోవు
శేషశైలవాస శ్రీనివాస

## మంచి తలపులు

రాజ్యమందు వృద్ధి రావలెనన్నచో
ప్రజలు సహకరించవలయు గాదె
సహకరించు ప్రజలకహమునీయకుదేవ
శేషశైలవాస శ్రీనివాస

ధరలు తగ్గుచున్న వరయ, సరకులకు
కరువు లేదు, నీదు కరుణ వలన,
ధరల పెంచ నీకు, సరుకు దాచనీకు
శేషశైలవాస శ్రీనివాస

చంటి బిడ్డ వంటి చల్లని తెల్లని
మధుర హృదయమున్న మనుజుడెపుడు
మనుజవర్యుడన్న ఘనకీర్తి నొందును
శేషశైలవాస శ్రీనివాస

బయటనున్న శత్రు బలములగెల్చుట
శక్తి యుక్తి వలన సాధ్యమౌను
లోననున్నవైరి లొంగిన శహబాసు
శేషశైలవాస శ్రీనివాస

ఎగురు పక్షి రెక్కలెట్లు చిత్రమునందు
స్థిరములనుచు దోచు చిత్తమందు
నటులె బతుకుతోచునయ్య సుస్థిరమంచు
శేషశైలవాస శ్రీనివాస

యుద్ధమొక్కటైన యుద్ధాల వరుసకు
దారి తీయుకాదె ధరణిలోన,
సహనశక్తి నిత్య శాంతికి మార్గము
శేషశైలవాస శ్రీనివాస

కాకి చెత్తను తిను కరణి, కాపురుషుడు
చెడ్డ పనుల చేయునడ్డులేక,
హంసవలె మెలగునహము లేనిమనుజుడు
శేషశైలవాస శ్రీనివాస

తప్పినావనియెడి తప్పు తలపు వద్దు
గెలువవలయునన్న తలపువలయు
అట్టి తలపు నిలుప గట్టిదౌహృదయము
శేషశైలవాస శ్రీనివాస

## మొద్దునిద్ర

కష్టమనక రుబ్బు కాంతకు దొరుకును
వలసినంత పిండి వండుకొనగ,
మొద్దు నిద్ర పోవ ముద్దకు కరువౌను
శేషశైలవాస శ్రీనివాస

## గానము

గానమేమన్నది గార్ధభమెరుగదు;
సున్నితమగు హృదయమున్నవాడు
తెలుసుకొనును దాని కిలగలఘనతను
శేషశైలవాస శ్రీనివాస

## తెలివిలేమి

తెలివి లేమి మనకు తెచ్చును శాపము,
తెలివి లేమి మనకు తెచ్చు బరువు,
తెలివి లేమి వలన కలుగు ననర్ధము
శేషశైలవాస శ్రీనివాస

## బరువు

పెండ్లి కాక మునుపు రెండు కాళ్ళొకనికి,
పెండ్లయినది మొదలు రెండు రెళ్ళు,
బిడ్డలెక్కువైన నడ్డివిరుగుకదా
శేషశైలవాస శ్రీనివాస

## తనువు

ప్రాణముండి మెదడు పని చేయునప్పుడు
మనిషి బుద్ధిశాలి, మార్గదర్శి
గుండెనిలువ తనువు మండి బూడిదయౌను
శేషశైలవాస శ్రీనివాస

## ఒడుపు

కారు కొనుటొక ఘనకార్యమేమియుకాదు,
నడుప వలయు దాని నొడుపునెరిగి
ఒడుపు నెరుగకున్న, పడిపడ ద్రోయును
శేషశైలవాస శ్రీనివాస

## శంకలు

నీ పనుపున వచ్చి నీదూతగా నిల్చి
ధరణి జనులసేమ మరసి, తలచి
సత్క్రియల నొనర్చ, శంకించెదరదేల?
శేషశైలవాస శ్రీనివాస

మంత్రమయిన నేమి తంత్రమయిననేమి,
మనిషి మంచి నెంచి పనుల చేయు
వారెనీ ప్రతినిధి, వేరు తలపులేల?
శేషశైలవాస శ్రీనివాస

రాతినాతి చేసి, రాయిగానీవుండి
మనిషి రూపమిచ్చి మహికి నీవు
పంపునట్టి వారి ప్రతిభ నమ్మముమేము
శేషశైలవాస శ్రీనివాస

హనుమబోలు భక్తులగుపడరీనాడు,
ప్రశ్నవేయ నట్టి భక్తి ఏది?
శక్తి ఎట్టిదైన శంకింతురేలనొ?
శేషశైలవాస శ్రీనివాస

పుట్టపర్తి సాయి పురుషోత్తముడనుచు
పెక్కు జనులనోట వాక్కు కాగ,
పదుగురాడుమాట పాటింపనేరరు,
శేషశైలవాస శ్రీనివాస

## గోదావరి

కోపమేల కల్గె గోదావరమ్మకు
తెలుగు నేల పూర్తి తుడిచివైచె
ఊరకుంటివేల? కారణమేమయ్యా?
శేషశైలవాస శ్రీనివాస

## వెల

అతి పవిత్రమైనదతివల శీలము
కొల్ల గొట్ట దాని కొనగనెంచు
మనిషిని మనిషనుచు, మనరాదుమహిలోన
శేషశైలవాస శ్రీనివాస

సరసమైన వెలకు సరకులు దొరకుచో
సరుకు దొరకదనెడు వెరపు లేక
సంతసముననెపుడు సంసారి బతుకును
శేషశైలవాస శ్రీనివాస

## బెదురు

ఆకసముననున్న లోకాల కేగియు
నేలమీద పోవు కీలు బండి
నదుపులోన నడుప బెదురును మనుజుడు
శేషశైలవాస శ్రీనివాస

## గురివింద

భరత రాజనీతి పరువు దింపగ జూచి
లోపమెంతురు తమ లొసుగు మరచి,
గుర్తువచ్చునయ్యె గురివెంద గింజలు
శేషశైలవాస శ్రీనివాస

## సబబా

అప్పుచేసి పెళ్ళి తప్పు లేదని మీరు
చెప్పినారు, మీరు చెప్పినట్లు
నడచు కొనుట మాకు న్యాయమందురు కదా!
శేషశైలవాస శ్రీనివాస

## వడ్డీ

అసలు ఋణముకన్న అధికమౌవడ్డీకి
మారువాడి సేటు మరులుకొనును
అప్పు తీర్చకున్న ముప్పు తిప్పలు పెట్టు
శేషశైలవాస శ్రీనివాస

## డి.యే.

కరువు భత్యమీయ కరుణించిన దొరలు
సగము చేతికీయ సమ్మతింప
ధరలు తిరిగి పెంచి, దాని దోచెదరయ్య!
శేషశైలవాస శ్రీనివాస

## తప్పా? తప్పు లేదా!

విభజనమ్ము నందు శుభమునెంచిరి 'బాపు'
ఒక్క భూమి రెండు ముక్కలాయె
మిత్రులనిన వారె శత్రువులైనారు
శేషశైలవాస శ్రీనివాస

## ఏమిటో

బ్రతుకు కొరకు జంతుతతి గడ్డి మేయును,
దాని పెంచువాడు మానవుండె,
గడ్డి గరచు, తినును కమ్మనియన్నము
శేషశైలవాస శ్రీనివాస

పాకిదాని వంచులేకిగ చూచెడి
తల్లులెల్లరు తమ పిల్లలకిల
పాకివారమన్న పరిపాటి మరతురు
శేషశైలవాస శ్రీనివాస

సొంత కొంపలోన ఎంతెంతలోయగు
పాడు పనుల మీద పడదు చూపు
పరుల గొడవలోన పరిధిలేని శ్రద్ధ
శేషశైలవాస శ్రీనివాస

ధరల పెంపకమ్మధర్మమనుచు చేయ
కాఫి హోటలులకుకట్టు బాటు;
నష్టమందురు మన కష్టము తెలియక
శేషశైలవాస శ్రీనివాస

పిచ్చివాని పిలిచి, పిల్లనిచ్చెదమన
ఏకధాటి వెక్కి ఏడ్చెనంట
అటులెయున్నదయ్య, అరయయువతరీతి
శేషశైలవాస శ్రీనివాస

పడకగదుల చేర్చి బాతురూములు కట్టి
తీరవలయు నేటి తీరు; అట్లు
లేని యిళ్ళనుండలేమందు రేలనో?
శేషశైలవాస శ్రీనివాస

వేలకోట్ల సొమ్ములీలగ భుజియించి
వీసమైన లేదు మోసమనెడి
వానిమాట నమ్మవచ్చునా? సర్వేశ
శేషశైలవాస శ్రీనివాస

బ్రతికినంతకాలమతి హీనముగ జూచి
తనువు ముగియగానె తంతు జరిపి
పూలమాలవైచి, పూజింప ఫలమేమి?
శేషశైలవాస శ్రీనివాస

ప్రతి పురుషుని విజయపథమున నడిపించు
అతివ యుండు వెనుకననుచు వింటి;
నతివకలదొ, లేదొ? అతినీవె గతి నీవె
శేషశైలవాస శ్రీనివాస

ఏది ఎచట నెట్లు లేర్పడి యున్నదో
ఎవరి కర్మమేమొ ఎరుగ నీవు,
ధర్మ పథమున చన దరి చేర్చు కొందువు
శేషశైలవాస శ్రీనివాస

వాదము సరిగనుక వాస్తవమనలేము
వాస్తవమగు కల్ల వాదమందు
నిర్వివాద మెట్లు న్యాయమూర్తుల తీర్పు
శేషశైలవాస శ్రీనివాస

ఉదయమందు లేచి, చదువ పత్రిక తీయ
తెలియు చుండు జగతి తెన్నుతీరు
లేదు తెన్ను నేడు, లేదు తీరది యేమొ
శేషశైలవాస శ్రీనివాస

ఏమి స్వామి, దేశమెందుకిట్లైనది
లేదు దేశ ప్రేమ, లేదు భక్తి
లేదు మనుషులందు లేశమైనను ప్రేమ
శేషశైలవాస శ్రీనివాస

కనుల పండుగైన కాశ్మీరమందున
పదము మోప గుండె చెదరి పోవు,
జగమెరిగిన నిజము, పగవానికొక మిథ్య
శేషశైలవాస శ్రీనివాస

## వలసినవి

వలయు దేహమునకు వ్యాయామము సరిగ,
మనసు మలచ వలయు మాన్యరీతి
ఆత్మ బోధ నెప్పుడనుసరించ వలయు
శేషశైలవాస శ్రీనివాస

## ఏకం సత్

సత్యసాయిలోన స్వామి నిన్నే జూతు,
షిరిడి సాయిలోన నరయమీరె
రాఘవేంద్రులందు, రమణునందున మీరె
శేషశైలవాస శ్రీనివాస

అయ్య, నిన్ను చూడనమ్మ మెచ్చుకొనును,
అమ్మ చూడ నఘములన్ని తొలగు,
నిరువురి దయ వలన తరియించు జన్మలు
శేషశైలవాస శ్రీనివాస

విజ్ఞులెందరో నిను వివిధ రూపమ్ముల
నెంతగానో సన్నుతింతురైన
సత్యమొకటి కనగ నాసత్యమే నీవు
శేషశైలవాస శ్రీనివాస

## ఆయె - పోయె

ఉదయమందు మంత్రి పదవిని చేబట్టె
మధ్యకాలమందు మాట తూలె
పడమట రవి మునిగె, పదవి తొలగి పోయె
శేషశైలవాస శ్రీనివాస

## సన్నిహితులు

సన్మమున మాకు సన్మానమును చేసి
సంతసింప చేసి రెంతగానో
వారి బ్రోవుమయ్య వందనమిదె ఈశ
శేషశైలవాస శ్రీనివాస

లలిత కళల సేవలక్ష్యముగా నెంచి
సంఘక్షేమమెంచి, సమతనెంచి
పాటుపడెడినీదు భక్తుల బ్రోవుము
శేషశైలవాస శ్రీనివాస

రమణ భక్తులు నటరాజవరేణ్యులు
దయను నన్ను చూచెధర్మమూర్తి
నిత్య సత్యవ్రతుల నిరతము బ్రోవుము
శేషశైలవాస శ్రీనివాస

ఇన్ని పద్యములను నన్ను మెచ్చి చదివి
అటనట సవరించి ఆదుకున్న
శ్రీతిరుపతి రాయు ప్రీతి దీవింపుమా
శేషశైలవాస శ్రీనివాస

తమ్ముడాంజనేయులమ్మను మరపించు
రీతిమమ్ము చూచు ప్రీతితోడ
నతని, నతని వారి నందరి బ్రోవుమా
శేషశైలవాస శ్రీనివాస

జయోస్తు

ఆటవెలది వందలైదు వ్రాయగజేసి
నన్ను ధన్యు చేసినావు తండ్రి
విజయమెవరిదయ్య, నిజముగమీదయ్య
శేషశైలవాస శ్రీనివాస